సంపాదకుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి                సంవత్సరం చందా ౨-౦-౦

# ప్రబుద్ధాంధ్ర

సంపుటము ౮ ]                రాజమహేంద్రవరము ౧౦ మార్చి ౧౯౩౮                [ ౧౨ వ సంచిక

## నివేదన

ఈసంచికతో ఎనిమిదో సంపుటం పూర్తి అయినది.

ఏప్రిలులో తొమ్మిదో సంపుటం ప్రారంభం.

మన ఆంధ్రజాతీయ పరిస్థితులు ఇప్పుడు చాలా క్లిష్టంగా వున్నాయి.

ఎన్నో అనుకూలావకాశాలు జారిపోయిన తరవాత, మళ్లీ హఠాత్తుగా చేజిక్కిన తరుణం యిది.

ఇప్పుడయినా మనం మేలుకోకపోతే—మేలుకుని జాగ్రత్తపడకపోతే మళ్లీ తేరుకోలేనంత అథమస్థితిలోకి వెళ్లిపోతాం.

ఈ సందర్భంలో ప్రబుద్ధాంధ్ర చెయ్యవలసినపని యెంతో వున్నది.

కొత్త సంవత్సరంలో, పత్రికలో ఎన్నో నూతనాంశాలు ప్రారంభించదలుచుకుని వున్నాము.

దేశీయులెంతబలమైన సాయంచేస్తే ప్రబుద్ధాంధ్ర అంత శ్రమపడి జాతిని సేవిస్తుంది.

మా ఆంధ్రసోదరులు ఈసంగతులు గుర్తించి మాకు సాయపడ కోరుతున్నాము.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

# ఆధునికాంధ్రవాఙ్మయం

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

### తయారైవున్నవి

1. గూడుపూరిన కొత్తరకం 0—2—0
2. కలంపోటు 0—2—6
3. తల్లిప్రాణం 0—2—6

### అచ్చులోవున్నవి

1. ఇల్లుపట్టిన వెధవాడబడుచు 0—4—0
2. అన్నంత పనీ జరిగింది 0—4—0

### శాస్త్రిగారి గ్రంథాలు మరికొన్ని

1 రక్షాబంధనం 1-0-0. 2 శ్మశానవాటిక 0-8-0. 3 వారకాంత 0-4-0. 4 విజయనగరరాజుల కథలు 0-2-0. 5 చిత్తూరురాజుల కథలు 0-3-0.

---

### ఇతరుల గ్రంథాలు

1. మునిమాణిక్యం నరసింహారావుగారివి 1 కాంతం కథలు 1-0-0, 2 సినీమా కాంతం 0-4-0, 3 ఉపాధ్యాయుడు 0-8-0, 4 వక్రరేఖ 1-0-0.
2. మొక్కపాటి నరసింహశాస్త్రిగారివి బారిష్టరు పార్వతీశం 1వ భాగం 1-0-0. 2 ప్రతిబింబములు 0-12-0, 3 ఏకోదరులు 0-8-0.
3. రాయప్రోలు సుబ్బారావుగారివి, 1 కవితాంజలి 1-0-0, 2 జడకుచ్చులు 1-0-0.
4. కపిలేశ్వరపురం రాజాగారి పల్లికేపను చింతలపూడి ఎల్లనార్యుని రాధామాధవము 1-8-0.
5. భమిడిపాటి కామేశ్వరరావుగారివి, 1 అవును 0-8-0, 2 అప్పుడు 0-8-0, 3 ఇప్పుడు 0-8-0, 4 నిజం 0-8-0, 5 కాలక్షేపం 0-8-0.
6. కవితాసమితివారివి, 1 వైశాఖి 1-0-0, 2 ఉత్కళపతనం 0-12-0, 3 ప్రభవ 0-8-0, 4 పూలమాల 0-4-0.
7. తేకుమళ్ల కామేశ్వరరావుగారివి, 1 కోపదారి మొగుడు 0-8-0, 2 జానకిక్షేమము మొదలైన చిన్నకథలు 0-8-0, 3 వాడుకభాష: రచనకి కొన్ని నియమాలు 0-8-0.
8. దేవరాజు వెంకటకృష్ణారావుగారివి, 1 సంజయరాయబారం 1-0-0, 2 శ్రీకృష్ణరాయబారం 1-0-0, 3 కర్ణచరిత్ర 0-10-0 4 శ్రీకృష్ణుడు 0-8-0, కారవాకి 1-0-0.
9. నాళం కృష్ణారావుగారివి, 1 తేనెచినుకులు 0-8-0, 2 పాలతరగలు 0-8-0, 3 గోరుముద్దలు 0-4-0, 4 మీగడతరకలు 0-5-0, 5 చిన్నబుడగలు 0-6-0, 6 గోగీతము 0-2-0, 7 పైడితేడి 0-2-0, 8 ముద్దు 0-4-0, 9 దీపావళి 0-8-0, 10 విరిదండ 0-8-0.
10. విశ్వనాథ సత్యనారాయణగారివి, 1 వేనరాజు 1-0-0, 2 అనార్కలీ 1-0-0, 3 కిన్నెరసానిపాటలు 1-0-0, 4 ఆంధ్రప్రశస్తి 1-0-0, 5 శృంగారవీధి 1-0-0.

### మరికొన్ని

వేయిస్తంభాలగుడిశాసనం 2-0-0, మల్లికార్జునరావు 0-10-0, రత్నాపణం 0-8-0, రసాంజలి 0-2-0, వసంతము 0-4-0, కవిగారిమునుగడ 0-8-0, విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్ర 1-8-0, మునిమాపు 0-12-0, వకుళమాల 0-12-0, మహామేధావులు 1-0-0, మధ్వాచార్యులవారి చరిత్ర 1-0-0, గీతమాలిక 0-12-0, సోమనాథవిజయం 0-12-0, భాగవతావతరణం 0-8-0. సుందరి 1-0-0, హృదయవిహంగము 0-4-0, నాకాభంగము 0-12-0, ఆంధ్రమహాసామ్రాజ్యము 1-4-0, నవకుసుమాంజలి 1-4-0, ఆంధ్రకావ్యాలంకారసూత్రవృత్తి 1-4-0, ప్రాచీనాంధ్రనాటకజీవనచారిత్రం 1-0-0, చంద్రగుప్త 1-4-0, పునర్వివాహం 1-0-0, సాహిత్యమీమాంస 1-8-0, నాటకవిమర్శ 2-0-0, గోల్కొండకవుల చరిత్ర 2-0-0, దృక్కలనిర్ణయచంద్రిక 1-4-0, సంఘోద్ధరణం 0-8-0, తొలకరి 0-8-0.

**కలాభివర్ధనీ పరిషత్తు—రాజమంద్రి**




సంపుటము ౮ ] రాజమహేంద్రవరము ౧౦ మార్చి ౧౯౩౯ [ ౧౨ వ సంచిక

# నిజాం రాష్ట్రమూ—మన ఆంధ్రులున్నూ

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## ౨

మొదటి వ్యాసంలో, హైదరాబాదునగరం తాలూకు జనసంఖ్యలో మతాలకు సంబంధించిన వివరాలు మాత్రమే యిచ్చి వున్నాను.

ఇక్కడ భాషలకు సంబంధించిన వివరాలిస్తున్నాను.

| | |
|---|---|
| హైదరాబాదు మొత్తం జనసంఖ్య | ౪,౬౬,౮౯౪ |
| ఇందులో | |
| ౧ ఆంధ్రం మాట్లాడేవారు | ౧,౭౩,౩౫౭ |
| ౨ మహారాష్ట్రం | ౧౬,౩౮౪ |
| ౩ కన్నడం | ౩,౫౩౧ |
| ౪ ఉర్దూ (హిందువులూ మస్లిములూ కలిసి) | ౨,౧౮,౨౦౬ |
| ౫ బంజారీ (లంబాడీ) | ౩౮౭ |
| ౬ ఎరుకల | ౨౮౯ |
| ౭ గుజరాతీ | ౫,౬౨౬ |
| ౮ రాజస్థానీ | ౮,౪౩౯ |
| ౯ అరవం | ౧౮,౦౬౩ |
| ౧౦ అరబ్బీ | ౧,౮౫౫ |
| ౧౧ ఇంగ్లీషు | ౯,౫౧౭ |

ఇక్కడ మనం గమనించవలసిన సంగతి యేమిటంటే?

హైదరాబాదులో మన ఆంధ్రులు ౬౦ వేలు తక్కువగా సగం వున్నారు. ౨౦ వేలు ఎక్కువగా మూడోవంతున్నారు.

పైగా ఆనగరం తెనుగుదేశఖండంలో నడిబొడ్డున వున్నది.

తక్కిన భాషలవారందరూ వర్తకం కోసమూ, వుద్యోగాల కోసమూ, రాజాశ్రయం కోసమూ వచ్చినవారే కాని స్థానికులు కారు; కాని అది తెనుగునగరం అన్నట్టుండదు. అక్కడ, ఆంధ్రులు, కలకత్తా బొంబాయివంటి దూరస్థపరభాషానగరాల్లో లాగ చెదిరి చెదిరి బెదుగుతూ బెదుగుతూ వున్నట్టు కనపడతారు.

కారణం?

మనలో వున్న స్వస్థానవేషభాషాద్వైముఖ్యమే.

పైవాళ్లని చూసినా నేర్చుకోలేని అవివేకమే.

మనది చరిత్రప్రసిద్ధమైన ప్రత్యేకజాతి అనే జ్ఞానం సుతరామూ లేకపోవడమే.

హైదరాబాదు వీధుల్లో మస్లిము లెందరో కనపడతారు; కాని చిత్రం యేమిటంటే! వారందరూ మస్లిములు కారు. వారిలో మూడోవంతయినా బ్రాహ్మలు—వైశ్యులు—రెడ్లు—ఇలాంటి శుద్ధాంధ్రు లుంటారు. మాటను పట్టికూడా వారాంధ్రు లని మనం గ్రహించలేము. వారు వురుదూలోనే మాట్లాడుకుంటారు. అవును, అదూ అచ్చంగా మస్లిములు మాట్లాడుతున్నట్టే వుంటుంది.

దీనికి సాయం హైదరాబాదులో వున్న పెద్దపెద్ద షాపుల్లో వొకటీ ఆంధ్రులది కాదు.

ఇంకొక సంగతి కూడా మనం గమనించతగ్గది వున్నది. అది మన అరవసోదరుల విషయం.

నిజాము రాష్ట్రం అంతటా వున్న అరవల మొత్తం సంఖ్య ౨౯,౦౫౦. కాని వారిలో ౧౮,౦౬౩ గురు ఒక్క హైదరాబాదులోనే వున్నారు.

ఎంచేత?

హైదరాబాదు, నిజామురాష్ట్రానికి రాజధాని.

రాష్ట్రం యెంత పెద్ద దయినా దాని ఆయువుపట్టు రాజధానిలో వుంటుంది. జిల్లాలలో యెంతెంత పెద్దపెద్ద ఆఫీసు లుండినా—యెంతెంత లేని మహామహాసంస్థ లుండినా వాటి ముసదాలన్నీ రాజధానిలో వుంటాయి.

రాజధానిలో వొక్కొక్క మంచి పదవి ఆక్రమించుకోగలిగితే అథవా పదస్థు లయినవారిలో వొక్కరి దయినా అనుగ్రహం సంపాదించుకోగలిగితే రాష్ట్రం అంతటా కొసుబంగారం కంటే యెక్కువగా చెలామణీ కావచ్చు.

అరవల కిది బాగా తెలుసు.

కనకనే వారు, మూడువంతుల్లో రెండువంతులు హైదరాబాదులోనే కనాయించారు.

తక్కువ ౧౧ వేల అరవలూ రాష్ట్రం అంతటా వ్యాపించగలిగారంటే—సర్కారు వుద్యోగాలలో స్థిరపడి వున్నా రంటే దానికి కారణం హైదరాబాదులో వున్న అరవల ప్రాబల్యమే.

ఈవొక్క సంగతీ చూస్తే మన అభాగ్యదశ పూర్తిగా బోధపడుతుంది.

మన ఆంధ్రదేశంలో మద్రాసూ, హైదరాబాదూ—రెండు రాజధాను లున్నవి.

బ్రిటిషిండియా రాష్ట్రాలలో మద్రాసురాష్ట్రం చాలా పెద్దది. అలాగే స్వదేశసంస్థానరాష్ట్రాలలో నిజామురాష్ట్రమున్నూ చాలా పెద్దది.

అయితే :

ఈరెండు పెద్దరాష్ట్రాల రాజధానులలోనూ మన ఆంధ్రులు తక్కువగానే కాకుండా అథమస్థితిలో వున్నారు.

ఈరెండు రాష్ట్రాల రాజధానులలోనూ అరవలే ప్రముఖు లయిన్నీ వున్నారు.

ఏం?

ఈదశావిపర్యయానికి మనవారిలో లేశమయినా విచారం కనపడదేం!

ఇది యిలా వున్న దనే పరిజ్ఞాన మయినా వున్నట్టు కనపడదేం?

ఈదౌర్భాగ్యదశ మనలో కంటే తక్కువే అయినా రాష్ట్రీయులే అయిన మహారాష్ట్రులలోనూ కన్నడులలోనూ కూడా లేకపోలేదు. ఈకింది అంకెలు చూస్తే యిది చాలా చక్కగా బోధపడుతుంది.

| | నిజామురాష్ట్రంలో (వేలు) | రాజధానిలో (వేలు) |
|---|---|---|
| ఆంధ్రులు | ౬౯౭౩ | ౧౭౩ |
| మహారాష్ట్రులు | ౩౭౮౭ | ౧౬ |
| కన్నడులు | ౧౬౨౦ | ౪ |
| అరవలు | .౨౯ | ౧౮ |

అంటే హైదరాబాదులో వేయింటికి

| | |
|---|---|
| ఆంధ్రులు | ౩౮౦ |
| మహారాష్ట్రులు | ౩౫ |
| కన్నడులు | ౭ |
| అరవలు | ౩౯ |

అరవల ముఖ్యవృత్తులు (అరవదేశంలో కూడా) రెండు. వాటిలో వొకటి ఉద్యోగం. రెండోది కాఫీహోటలు.

హైదరాబాదులో అరవకాఫీహోటళ్లు ప్రతివీధినీ వున్నాయి. అయినా వుద్యోగాలలోనే వారి సంఖ్య యెక్కువ.

దానికి కారణం బ్రిటిషురాష్ట్రాలలో లాగే నిజాము రాష్ట్రంలో కూడా వుద్యోగస్థుల జీతాలు చాలా యెక్కువ కావడం.

కాస్త మంచి వుద్యోగం సంపాదించుకోగలిగితే, పొదుపైన మనిషి, అక్కడే కూడా వుద్యోగం మానుకు నేటప్పటికి లక్షాధికారి కావచ్చు.

## అధికారుల జీతాలు

నిజామురాష్ట్రంలో రాజ్యాంగయంత్రం నడిపే అధికారుల జీతాలూ అలవెన్సులూ యిలా వున్నవి.

| ఉద్యోగి | నెలజీతం (రూపాయిలు) | అలవెన్సు (రూపాయలు) |
|---|---|---|
| ౧ పేష్కారు | ౬౦౦౦ | |
| ౨ ప్రధానమంత్రి | ౭౦౦౦ | ౧౦౦౦ |
| ౩ సైన్యశాఖామంత్రి | ౩౫౦౦ | |
| ౪ ఫైనాన్సుమంత్రి | ౪౨౫౦ | ౧౦౦ B. G. |
| ౫ రెవెన్యూమంత్రి | ౪౦౦౦ | ౧౦౦ మోటారు |
| ౬ P. W. D. శాఖమంత్రి | ౩౫౦౦ | |
| ౭ న్యాయశాఖమంత్రి | ౩౫౦౦ | |
| ౮ పొలిటికల్ డిపార్టుమెంటుమంత్రి | ౩౫౦౦ | ౫౦౦ |
| ౯ ప్రభువు సముఖంలోవుండేమంత్రి | ౪౦౦౦ | |
| ౧౦ ఎక్జిక్యూటివు కౌన్సిల్ సెక్రటరీ | ౧౨౦౦ | ౩౦౦ |
| ౧౧ పొలిటికల్ డిపార్టుమెంటు సెక్రటరీ | ౧౫౦౦ | |
| ౧౨ పొ. డి. అసిస్టెంటుసెక్రటరీ | ౧౨౦౦ | |
| ౧౩ ఫైనాన్సు సెక్రటరీ | ౧౫౦౦ | ౫౦౦ |
| ౧౪ రెవెన్యూసెక్రటరీ | ౩౨౫౦ | ౨౫౦ B. G. |
| ౧౫ ఇనాములశాఖాధికారి | ౧౨౫౦ | |
| ౧౬ రెవెన్యూసంయుక్తకార్యదర్శి | ౧౨౦౦ | ౩౦౦ |
| ౧౭ రెవెన్యూఅసిస్టెంటుసెక్రటరీ | ౧౦౦౦ | ౧౦౦ |
| ౧౮ ఫైనాన్సుఅసిస్టెంటుసెక్రటరీ | ౧౨౦౦ | ౧౦౦ |
| ౧౯ న్యాయశాఖసెక్రటరీ | ౨౦౦౦ | ౩౦౦ |
| ౨౦ న్యాయశాఖఅసిస్టెంటుసెక్రటరీ | ౧౨౦౦ | |
| ౨౧ P. W. D. శాఖసెక్రటరీ | ౨౫౦౦ | ౮౫౦ |
| ౨౨ అసిస్టెంటుఛీఫ్ఇంజనేర్ | ౧౫౦౦ | ౩౦౦ |

| | | |
|---|---|---|
| ౨౩ అసిస్టెంటుసెక్రటరీ | ౧౨౦౦ | |
| ౨౪ డ్రెయినేజిసెక్రటరీ | ౧౮౦౦ | ౩౫౦ |
| ౨౫ వ్యాపారశాఖసెక్రటరీ | ౧౨౦౦ | ౬౦౦ |
| ౨౬ లీగల్ అడ్వైజరు | ౨౦౦౦ | ౩౦౦ |
| ౨౭ మతశాఖసెక్రటరీ | ౧౫౦౦ | |
| ౨౮ అక్కౌంటెంటుజనరల్ | ౧౫౦౦ | ౩౦౦ |
| ౨౯ టంకసాలఅధికారి | ౨౦౦౦ | ౬౦౦ |
| ౩౦ సుబేదారు | ౧౫౦౦ | ౧౦౦ |
| ౩౧ ఫస్టుగ్రేడుజిల్లాకలెక్టరు | ౧౨౦౦ | |
| ౩౨ సెకండుగ్రేడుజిల్లాకలెక్టరు | ౬౦౦ | |
| ౩౩ తహశ్సీలుదారు | ౩౦౦–౩౫౦ వరకు | |

# రాష్ట్రాదాయం

### ౧౩౪౨ ఫసలీలో రాష్ట్రాదాయం పద్దులు

| | |
|---|---|
| ౧ భూమిపన్ను | ౩,౦౫,౪౩,౦౦౦ |
| ౨ అడవులు | ౧౩,౬౬,౦౦౦ |
| ౩ కష్టమ్సు (కరోడగిరీ) | ౧,౦౨,౫౪,౦౦౦ |
| ౪ ఆబ్కారీ | ౧,౫౮,౪౪,౦౦౦ |
| ౫ నల్లమందు—గంజాయి | ౧౪,౨౬,౦౦౦ |
| ౬ స్టాంపులు | ౧౯,౯౧,౦౦౦ |
| ౭ రిజిస్ట్రేషను | ౨,౯౫,౦౦౦ |
| ౮ గనులు | ౨,౮౨,౦౦౦ |
| ౯ బీరారుప్రతిఫలం | ౨౯,౧౭,౦౦౦ |
| ౧౦ వడ్డీ | ౭౩,౫౮,౦౦౦ |
| ౧౧ టంకసాల | ౫౪,౦౦౦ |
| ౧౨ నోట్లు (కాకితాలు) | ౨౦,౯౬,౦౦౦ |
| ౧౩ నాణెములమారకం | ౧౨,౦౦౦ |
| ౧౪ పోస్టు | ౧౧,౨౭,౦౦౦ |
| ౧౫ ఇరిగేషన్ | ౪౧,౦౦౦ |
| ౧౬ రైల్వేలు | ౩౮,౧౮,౦౦౦ |
| ౧౭ ఎలెక్ట్రిసిటీ | ౧,౩౮,౦౦౦ |
| ౧౮ ఇతరాలు | ౫,౫౧,౦౦౦ |

**మొత్తం ఆదాయం ౮,౦౬,౧౮,౦౦౦**

# ఖర్చులు

### ౧౩౪౨ ఫసలీలో రాష్ట్రం ముఖ్యఖర్చులు

| | |
|---|---|
| ౧ రెవెన్యూ | ౬౮,౭౦,౦౦౦ |
| ౨ ఇరిగేషను | ౭,౦౮,౦౦౦ |
| ౩ అడవులు | ౯,౪౬,౦౦౦ |
| ౪ కష్టమ్సు (కరోడగిరీ) | ౨౨,౨౮,౦౦౦ |
| ౫ ఆబ్కారీ | ౩౨,౧౮,౦౦౦ |
| ౬ నల్లమందు—గంజాయి | ౧,౧౪,౦౦౦ |
| ౭ స్టాంపులు | ౧,౧౧,౦౦౦ |
| ౮ రిజిస్ట్రేషను | ౧,౬౩,౦౦౦ |
| ౯ గనులు | ౮౮,౦౦౦ |
| ౧౦ వడ్డీ | ౩౪,౬౮,౦౦౦ |
| ౧౧ అప్పులు | ౬,౦౦,౦౦౦ |
| ౧౨ టంకసాల | ౧,౬౩,౦౦౦ |
| ౧౩ ప్రభువు గారికి చెల్లింపులు | ౫౪,౧౩,౦౦౦ |
| ౧౪ యువరాజుల ఖర్చులు | ౭,౮౪,౦౦౦ |
| ౧౫ జనరల్ పరిపాలన | ౪౧,౧౪,౦౦౦ |
| ౧౬ మన్సబులు | ౧౫,౪౬.౦౦౦ |
| ౧౭ మిలిటరీ | ౮౮,౫౮,౦౦౦ |
| ౧౮ న్యాయస్థానాలు | ౨౨,౫౭,౦౦౦ |
| ౧౯ జెయిళ్లు | ౪,౯౫,౦౦౦ |
| ౨౦ పోలీసు | ౬౭,౪౪,౦౦౦ |
| ౨౧ విద్య | ౯౮,౨౦,౦౦౦ |
| ౨౨ వైద్యం | ౨౯,౩౬,౦౦౦ |
| ౨౩ మతశాఖ | ౧౨,౧౯,౦౦౦ |
| ౨౪ వ్యవసాయశాఖ | ౮,౫౫,౦౦౦ |
| ౨౫ పశువైద్యం | ౪,౭౨,౦౦౦ |
| ౨౬ సహకారశాఖ | ౩,౮౯,౦౦౦ |
| ౨౭ మునిసిపాలిటీలు | ౫౧,౮౨,౦౦౦ |
| ౨౮ రోడ్లు—బంగాళాలు | ౬౯,౪౨,౦౦౦ |
| ౨౯ రైల్వేలు | ౧,౫౫,౦౦౦ |
| ౩౦ పరిశ్రమలు | ౩,౧౧,౦౦౦ |

# పరిపాలనం

ఇవాళ, ప్రజలకు, సర్వస్వాతంత్ర్యాలూ దఖలుపడా లని తీవ్రత రాందోళనం జరుగుతున్న యీనిజాము రాష్ట్రంలో ౭౧ సంవత్సరాల కిందట ప్రభువూ పన్నులవసూళ్లూ తప్ప మరేమీ లేవు.

రెవెన్యూ కచేరీ లేదు. స్టాంపులు లేవు. న్యాయస్థానాలు లేవు. చివరికి పోలీసులు కూడా లేరు.

గ్రామాలలో పొలిమేరల యేర్పాట్లు లేవు. భూములకు కొలతలూ, పట్టాలూ, పన్నుల నిర్ణయమూ లేవు.

కలెక్టర్లు లేరు. తహస్సీలుదార్లు లేరు.

సర్కారు ఖజానా కూడా లేదు.

అప్పుడు సుబాలకు మారుగా సర్కారులుండేవి. జిల్లాలకు బదులు మహాలులూ, తాలూకాలకు మారుగా పరగణాలూ వుండేవి.

రాజధానిలో అప్పుడు "దఫ్తరే మాల్" అనీ "దస్తరే దీవానీ" అనీ రెండు కచేరీలే వుండేవి. "దారుల్ ఇన్షా" అని, మంత్రికి, మరివొక కచేరీ వుండేది.

దేశముఖులూ, దేశపాండ్యాలూ, తాలూక్దార్లనే పేరితో గుత్తదార్లూ పన్నులు వసూలు చేసేవారు.

*ఫలానా పర్గణాకు మొత్తం యింత పన్ను అని గుత్తకు పుచ్చుకుని,* వారు ప్రజలను పీడించి తమ యిష్టం వచ్చినంత పుచ్చుకుని, గుత్తమొత్తం సర్కారుకి చెల్లించి మిగతా యావత్తూ తమ సొంతానికి వాడుకుంటూ వుండేవారు.

ఏపేరు పెట్టి యెంత వసూలు చేసినా, ఏయే వృత్తులకు పన్ను కట్టినా వారిని అడిగేవారు లేకపోయేవారు. వెట్టిచాకిరీలు చేయించుకున్నా వారికి అడ్డు లేకపోయేది.

ఈపన్నుల వసూళ్లసందర్భంలో వొకచారిత్రికాంశంచెబుతాను.

వరంగల్లు ప్రాంతంలో వొక చిన్న గుత్తేదారుండేవాడు.

దేనికి పన్ను విధించాలో, ఎంత విధించాలో—యీనిర్ణయం గుత్తేదారుదే. ఆపరగణాకు ఇంత మొత్తం అనే తప్ప నవాబు యీ వివరాలకు వెళ్లేవాడు కాడు.

అంచేత గుత్తేదారు కల్పనాచాతుర్యాన్ని బట్టీ, రాక్షసత్వాన్ని పట్టీ పన్నులు ఎక్కడికక్కడే ఒక్కొక్క రకంగా వుండేవి.

ఆగుత్తేదారు స్త్రీలకు కూడా పన్ను వేశాడు.

ఇంతే కాదు. ఆపన్ను ఇంత అని నిర్ణయించడానికి అద్భుతమూ, అమోఘమూ అయిన వొక విధానం కూడా కనిపెట్టాడు.

అదేమిటంటే? అతని పరగణాలో వున్న ప్రతీ ఆడదీ, ఏటా, తన స్తనాలలో వొకటి ఎంత వున్నదో అంత రూపాయలపోగు చెల్లించాలి. ఆమె స్తనాలలో పెద్దచిన్న తారతమ్యం వుంటే గుత్తేదారు ఆపెద్దస్తనాన్ని బట్టి పన్ను చెల్లించాలనేవాడు.

ఇంకోటి కూడా కనిపెట్టాడతను.

ఉజ్జాయింపుగా రూపాయలు పోగువేస్తే రూపాయలు ఎక్కువయినా యని ఆస్త్రీ, తక్కువయినా యని ఆగుత్తేదారూ పేచీలు పడవచ్చు. అలా ఘర్షణపెరగడం యెల్లప్పుడూ మంచిది కాదనీ, ఏస్త్రీకయినా దానివల్ల అక్రమం జరగవచ్చుననీ, అలా జరగడం శ్రేయస్కరం కాదనీ ఆధర్మాత్ముడు నిశ్చయించుకున్నాడు. అందుకోసం అతను రకరకాల గిన్నెలు చేయించాడు.

ఇది కల్పన కాదు. అక్షరాలా జరిగింది. వరంగల్లు ప్రాంతంలో చంద్రగిరిగుట్ట లని వొక కొండ. ఆకొండమీద వొక దుర్గం. ఆదుర్గాధిపతి చేసిందిది.

ఇలాగ పన్నుల నిర్ణయమూ, దానివసూళ్లూ అనేకవిధాలుగానూ, చాలా ఘోరంగానూ వుండేవి.

ఇలాంటి స్థితిలో, ౧౮౫౪ సంవత్సరంలో సర్. సాలార్ జంగు బహద్దరుగారు నైజాము ప్రధానమంత్రి అయినారు.

దీంతో నైజామురాజ్యంలో అరుణోదయం అయి అంధకారం దిగజారి లోకి వచ్చింది.

ఆయన, మొదట, రాష్ట్రం అంతనూ సుబాలుగానూ, జిల్లాలుగానూ, తాలూకాలుగానూ విభజించారు. గుత్తేదారులను తీసివేసి సుబేదారులనూ, కలెక్టర్లనూ, తహశీల్దార్లనూ జీతాలమీద ఏర్పరిచారు. కోర్టులనూ, మున్సిఫ్‌లనూ, జిల్లాజడ్జీలనూ (మీర్ అదిల్) ఏర్పాటు చేశారు. జిల్లాపోలీసును ఏర్పాటుచేశారు. ప్రతీతహశీల్దారుదగ్గిరా రెండేసివందల పోలీసు బలగం చొప్పున వుంచారు.

క్రమంగా, ౧౨౭౦ ఫసలీలో కస్టమ్సు శాఖనూ, ౧౨౭౧ లో స్టాంపుకచ్చేరీని, ౧౨౭౨ ఫసలీలో డిక్రీల తామీలుకచ్చేరీ, న్యాయవిచారణ మీద తనిఖీ చెయ్యడానికి శక్రటరీ శాఖనూ, ౧౨౭౪ ఫసలీలో రెవెన్యూడిపార్టుమెంటునూ, ౧౨౭౪–౧౨౯౦ ఫసలీల మధ్యకాలంలో వైద్యశాఖా, విద్యాశాఖా, అడవుల శాఖా, టపా శాఖా—ఇంకా మరికొన్ని శాఖలనూ ఏర్పరిచారు.

౧౮౯౩ సంవత్సరంలో ఇప్పటినవాబుగారి తండ్రి మీర్ మహబూబలీఖాన్ బహద్దరువారు శాసనసభను నిర్మించారు.

శాసనసభ అంటే ౧ ప్రధానన్యాయమూర్తి. ౨ హైకోర్టు న్యాయమూర్తి, ౩ రెవెన్యూశాఖాధికారి, ౪ విద్యాశాఖాధికారి, ౫ జిల్లా పోలీసుశాఖాధికారి, ౬ ఆర్థికశాఖ శక్రటరీ ఈ ఆరుగురే అందులో సభ్యులు. వీరిమీద ప్రభువు సర్వాధికారి.

వీరికాలంలోనే—అనగా ౧౯౦౨ లో నవాబుగారు బేరారును శాశ్వతంగా బ్రిటిషువారికి కౌలు కిచ్చేటట్టూ, అందుకు ప్రతిఫలంగా బ్రిటిషువారు నిజాముగారికి ఏటా ౨౫ లక్షల రూపాయలు ఇచ్చేటట్టూ కౌలు అంటే వడంబడిక జరిగింది. ౧౯౧౧ అగస్టు ౨౯ తేదీని ఆనవాబుగారు చనిపోయారు.

తరవాత ఇప్పటి నవాబు సర్. ఉస్మానలీఖాన్ బహద్దరువారు అధికారం వహించారు.

ఇవాళ చూస్తే—సభ్యత గల ప్రభుత్వాల పరిపాలనా విధానాన్ని పట్టిచూస్తే నైజాం ప్రభుత్వము లక్షయుగాల వెనకనేవుంది; కాని యిప్పటినవాబుగారు ఎన్నో మార్పులు చెయ్యగా ఏర్పడిన విధానం యిది.

వీరు చేసినవాటిలో ముఖ్యమైనవి.

౧ హైదరాబాదులో హైకోర్టు, ఉస్మానియాహాస్పిటల్, ఉస్మానియాయునివర్సిటీ మొదలైనవీ, రాజవీధులూ ఏర్పరచడం.

౨. అనేకతటాకాలు — ఉస్మాన్‌సాగరం, నిజాంసాగరం, హిమాయత్‌సాగరం మొదలైనవి నిర్మించడం.

౩. బాబె హుకూమత్—అంటే ఎక్జిక్యూటివుకౌన్సిల్ (కార్యనిర్వాహకసభ) ఏర్పరచడం.

౪. న్యాయశాఖను కార్యనిర్వాహకశాఖను విడదియ్యడం. (యీ ఫైయిల్లో కాంగ్రెస్సుకోరికను పద్ధెనిమిదేళ్లకిందట నిజాముప్రభువు నెరవేర్చారు. కాని కాంగ్రెస్సుమంత్రులు మాత్రం ఆపని యిప్పటికీ చెయ్యలేదు)

౫. రెయిల్వేలూ, రోడ్డులూ హెచ్చుచెయ్యడం.

౬. ఉర్దూభాషను ప్రధానం చేసి అది నిమిషాలమీద అభివృద్ధి అయిపోడానికి తగిన తీవ్రమైన కార్యక్రమం ప్రారంభించడం.

# శాసనసభ

నైజాముగారికి శాసనసభ యెందుకూ అని అడిగితే "నూటనల భైనాలుగులక్షల జనులను, తాము నిరంకుశంగా పరిపాలించడం లేదు" అని చెప్పుకోడానికి మాత్రమే.

నిజంగా ౧౯౩౫ సంవత్సరం ఇండియాశాసనమే నిరంకుశంగా వుందని అసంతృప్తి పొందుతున్న మనం నైజాముగారి శాసనసభను "శాసనసభే" అని అంగీకరించము. అంగీకరించలేము.

దానిలో ప్రజాస్వామికత్వానికి సంబంధించిన ప్రాతిపదికలు కూడా లేవు.

దాంతో పోల్చతగ్గది గాంధిగారి కాంగ్రెస్సు వొక్కటే.

ఏమంటే? నైజాముగారి సొంత అభిప్రాయాల ననుసరించి యెలాంటి శాసనాలైనా యేర్పడడాని కందులో అవకాశాలున్నవి. వారికి అంగీకారం కాని శాసనాలను తొలగించడానికి—రద్దుచెయ్యడానికి కూడా వారి కందులో అవకాశా లున్నవి.

కొత్త శాసనాలు చెయ్యడానికీ, వున్నవాటిలో మార్పులు చెయ్యడానికీ, ఫర్మానాలు జారీచెయ్యడానికీ, ఇతరవిధాలకూడా తమ యిష్టానుసారం ఆజ్ఞలు చెయ్యడానికీ నైజాముగారు సరస్వతంత్రులు. వారి యీ అధికారాలను శిరసావహించే పద్ధతిలోనే వారి శాసనసభకు సజీవత్వం.

వారి ప్రభుత్వంలో అలాంటిదే కార్యనిర్వాహకసభ (ఎక్జిక్యూటివుకౌన్సిల్) కూడా వున్నది.

ఈశాసనసభను వెనకటి నవాబు మహబూబలీఖాన్ బహద్దరు గారు ౧౮౯౩ లో నిర్మించారని పైని తెలిపి వున్నాను. అంటే ౧౩౦౪ ఫసలీ తాలూకు ౧ వ ఖానూన్ అనుసరించి నిర్మించబడ్డది. దీని నియమాలలో కొన్ని ౧౩౦౯ ఫసలీ తాలూకు ౩ వ ఖానూన్ అనుసరించిన్నీ, కొన్ని ౧౩౧౫ ఫసలీ తాలూకు ౧ వ ఖానూన్ అనుసరించిన్నీ మార్చబడ్డవి.

మార్చబడ్డవి. నిజమే.

కాని ఈ ౪౦ సంవత్సరాలలోనూ జరిగిన మార్పులలో స్ఫుటంగా కనబడేది వొక్కటీ లేదు. ప్రజలకు చెప్పుకో తగ్గ అధికారాలిచ్చేది అసలే లేదు.

ఇక వివరా లిస్తాను.

దీని సభ్యుల సంఖ్య ౨౨.

ఇందులో అధికారి సభ్యులూ, అధ్యక్షోపాధ్యక్షులూ కలిసి ౧౪ గురు. అనధికారిసభ్యులు ౮ గురు.

ఇంకా విస్తరించా లంటే.

అధికారిసభ్యులలో ౧. ప్రధానన్యాయమూర్తీ (మీర్ మజ్లిస్) ౨. న్యాయశాఖ కార్యదర్శీ (మొతేమత్ అదాలత్) ౩. లీగల్ అడ్వైజరూ (ముషీరెఖానూన్) వుండితీరాలి.

అనధికారిసభ్యులలో జాగీర్దారుల పక్షంగా ఇద్దరూ, వకీళ్ల పక్షంగా ఇద్దరూ, పాయగా సంస్థానాల పక్షంగా పంపబడే సభ్యుడొకడూ, మంత్రి నియమించిన సభ్యు డొకడూ, అనధికారి సభ్యులలో తమ హయాము పూర్తి కాగా విరమించేటప్పుడు వారిలోనుంచి మంత్రి నియమించే సభ్యు లిద్దరూ వుంటారు.

సంవత్సరానికి ౬ వేలుగాని, అంతకంటే యెక్కువగా కాని ఆదాయం వచ్చే జాగీర్దార్లే తమలో యిద్దర్ని ఎన్నుకోవాలి. వారే జాగీర్దార్లపక్షం సభ్యులు.

వకీళ్లలో హైకోర్టు వకీళ్లే తమలో యిద్దర్ని ఎన్నుకోవాలి. వారే వకీళ్ల పక్షం సభ్యులు.

అంతకు తక్కువ ఆదాయం గల జాగీర్దార్లకూ, హైకోరు వకీళ్లు కాని వకీళ్లకూ నియోజకత్వం లేదు.

నిజానికి అనధికారి సభ్యులు ౮ గురే; కాని వారిలో, ఉద్దేశం వుంటే—ధైర్యం వుంటే—సాహసం కూడా వుంటే సొంత అభిప్రాయాలు వెల్లడించడానికి వీలున్నవారు వకీలు సభ్యు లిద్దరే.

ఎన్నికలు రెండేళ్ల కొకమాటు జరుగుతాయి. లీగల్ అడ్వైజరే శాసనసభ కార్యదర్శి. సభ యెప్పుడు కూడేదీ, ఎన్నడు జరిగేదీ, ఎన్నిమాట్లు జరిగేదీ, అంతా మంత్రి యిష్టం. కోరం ౫. కోరం వుండినా అధ్యక్షుడు సభ నిలిపివెయ్యవచ్చు.

## ౧౩౪౪ ఫసలీలో వున్న సభ్యులు

| | | |
|---|---|---|
| ౧ అధ్యక్షుడు. | ౧ | |
| ౨ ఉపాధ్యక్షుడు. | ౧ | |
| ౩ మీర్ మజ్లిస్ | ౧ | వీరు హోదానుసరించి సభ్యులు |
| ౪ హోముసెక్రటరీ | ౧ | |
| ౫ లీగల్ అడ్వైజరు | ౧ | |
| ౬ ఉమూరేమజహబి (మతశాఖాధికారి, | ౧ | అధికారిసభ్యులు |
| ౭ ఆర్థికశాఖశెక్రటరీ | ౧ | |
| ౮ అతియాత్ సాబిం (ఇనాముల శాఖాధికారి) | ౧ | |
| ౯ రాజకీయశాఖ సెక్రటరీ (మొతేమద్ సియాసియాత్) | ౧ | |
| ౧౦ హైకోర్టున్యాయమూర్తులు | ౨ | |
| ౧౧ కొత్వాలు | ౧ | |
| ౧౨ సర్ఫెఖాస్ స్పెషల్ ఆఫీసరు | ౧ | |
| ౧౩ పారిశ్రామిక కార్యదర్శి | ౧ | |
| ౧౪ మీర్ మజ్లిస్ పాయగా | ౧ | అనధికారిసభ్యులు |
| ౧౫ హైకోర్టువకీళ్లు | ౨ | |
| ౧౬ జాగీర్దార్లు | ౨ | |
| ౧౭ సాహుకారి | ౧ | |
| ౧౮ అసాధారణసభ్యులు | ౨ | |

## నిబంధనలు

సభ్యులు ప్రవేశపెట్టిన బిల్లులు శాసనములుగా నెగ్గగలిగితే అవి ప్రభువు అనుమతికోసం పంపబడతవి. తన వోటుతో కూడా అనుకూల్యమూ ప్రాతికూల్యమూ సమానంగా తేలితే, అధ్యక్షుడు, తన కాష్టింగు వోటుతో దాన్ని నెగ్గించడమో పడగొట్టడమో చెయ్యగలడు. అధ్యక్షుల అనుమతి లేకుండా ౧. సర్కారు ఆదాయమూ, ఖజానా, బాకీలూ—వీటిని గురించీ, ప్రజల మత విశ్వాసాలను గురించీ, సైన్యాన్ని గురించీ, నిజాముప్రభుత్వానికీ బ్రిటిషుప్రభుత్వానికీ గల సంబంధాలను గురించీ, శాసనసభ నియమావళిని గురించీ, ఎవరూ బిల్లులు ప్రవేశపెట్టగూడదు. నైజాముగారి ఫర్మానాలకు విరుద్ధంగా కూడా ఏమీ ప్రవేశపెట్టగూడదు.

అయినా ఇస్లాముమతశాసనాలూ, హిందూధర్మశాస్త్రాలూ, ఆయాసంఘాల ప్రత్యేకశాసనాలూ, ఆచారములూ—వీటికి సంబంధించిన బిల్లులు ప్రవేశపెట్టవచ్చు.

ప్రతీబిల్లూ వారంరోజులకు ముందు ప్రతీసభ్యుడికీ పంపుతారు. మార్పులూ, కూర్పులూ చెయ్యవలసిన అగత్యం కనపడితే వాటిని సెలెక్టుకమిటీలకు పంపుతారు. తరవాత వాటి గతి మెజారిటీని బట్టి వుంటుంది.

మెజారిటీ!

ఎంత శాస్త్రీయమైన మాటా!

అయితే; ప్రజల పక్షంగా చూస్తే మాత్రం యీ మెజారిటీ గాలిలోవున్న దీపానికి దేవుడి రక్షణ వంటిదే.

ఇది యింతటితో తీరలేదు.

ఇంతమాత్రపు మెజారిటీకి కూడా నిక్కచ్చి అయిన వడపోత వున్నది.

అదేమిటంటే? నైజాముగారు ఆశాసనం సవరించవచ్చు. మార్చవచ్చు. తిరస్కరించవచ్చు. రద్దుచెయ్యవచ్చు. ఏమయినా చెయ్యవచ్చు.

## దీని నివాసం యెలా వున్నదంటే?

దీనికి సొంత భవనం వున్నది. ౧౩౨౧ ఫసలీలో భవనప్రవేశమహోత్సవం జరిగింది. అప్పుడు, సభవారు, అధికారిసభ్యులూ, అనధికారిసభ్యులూ సమంగా వుండేటట్టు అనుగ్రహించవలసిందని నవాబుగారికి విన్నవించుకున్నారు. దానికి, నవాబుగారు, "ఆరేళ్ల దాకా యిదివరకి వున్న అనధికారిసభ్యులు ఆరుగురికీ సాయం మరో యిద్దరుగుర్ని కూడా తీసుకుంటూ వుండవచ్చు" నని హుకుం దయచేశారు; కాని అది యిప్పటికీ అమల్లోకి రాలేదు.

ఇప్పుడు జరుగుతున్నది ౧౩౪౬ వ ఫసలీ.

# కార్యనిర్వాహకసభ

ఇంగ్లీషులో యిది ఎక్జిక్యూటివుకౌన్సిల్. ఉర్దూలో బాబెహుకూమత్.

పూర్వం కౌన్సిల్ అఫ్ స్టేటు అనేది వుండేది. తరవాత కాబినెట్టుకౌన్సిలు అనేది కొంతకాలం వుంది. ౧౮౯౩ లో పుట్టిన "ఖానూన్చముబారక్" అనే శాసనం ప్రకారం యివి నిర్వర్తించబడేవి. ఇప్పటి నవాబుగారు పరిపాలన ప్రారంభించాక కూడా ప్రధానమంత్రి దీనిని కొంతకాలం నడిపించారు. నవాబుగారే అయిదేళ్లు మంత్రిగా కూడా పనిచేశారు. దానివల్ల రాజ్యపాలన యెంత భారమో తెలిసింది. అంచేత, వారు, ౧౩౨౯ వ ఫసలీ దైనెల ౧౭ వ రోజున యీ బాబెహుకూమత్ ఏర్పరిచారు.

దీనికి అధ్యక్షుడు సదరె ఆజం. అంటే ప్రధానమంత్రి. దీనిలో సభ్యులు ఎనమండుగురు. వారిలో ఆరుగురు ఆరు రాజ్యాంగశాఖల పక్షంగా వుంటారు. సదరుల్ మహాం అని వారి హోదా పేరు.

ఇది వారానికోమాటు కూడుతుంది. ప్రధానమంత్రి లేకపోతే ప్రభువుగారొకర్ని అధ్యక్షతకు నియోగిస్తారు. అధికసంఖ్యాకుల నిర్ణయం నెగ్గుతుంది.

అది నవాబుగారి అనుమతికి వెడుతుంది. తరవాత వారి చిత్తం.

పెద్దవుద్యోగస్థుల నియామకాలూ, వారి తప్పొప్పుల విచారణా, భూమిశిస్తుల హెచ్చింపు తగ్గింపులూ, అప్పీళ్ళు (మురాఫాలు) వినడమూ, సర్క్యులర్లు (గస్తీలు) జారీచెయ్యడమూ, ఆదివరకు చేసిన వాటిని రద్దుచెయ్యడం, విద్యావిషయాలూ, ఆరోగ్యనియమాలూ, ఆర్థికనిర్ణయాలూ, వ్యాపారపరిశ్రమల ప్రోత్సాహమూ, రోడ్లూ, రెయిళ్ళూ మొదలైన రాకపోకల సంబంధాలూ సరిగా నడిపించడమూ—మొదలైనవి దీని పనులు.

## సదరుల్ మహాములు

కార్యనిర్వాహకశాఖలో ఆరుగురు సదరుల్ మహాములు ఆరు రాజ్యాంగశాఖలు నిర్వహిస్తారని పైని చెప్పి వున్నాను. వారి వివరాలు.

## ౧. సదరుల్ మహాం మాల్

మాల్గుజారీ అంటే రెవెన్యూ శాఖ. సదరుల్ మహాంమాల్ అంటే రెవెన్యూమెంబరు. ఈమెంబరు నిర్వహించే డిపార్టుమెంట్లు ఇవి. ౧. రెవెన్యూ ౨. కస్టమ్సు ౩. ఆబ్కారీ ౪. బందోబస్తు (సెటిల్ మెంటు) ౫. అడవులు (జంగ్లాత్) ౬. స్టాటిస్టిక్సు ౭. అతియాత్ (ఇనాములు) ౮. అభివృద్ధిశాఖ (డెవలప్మెంటు) ౯. కొత్వాలీబల్దా (సిటీపోలీసు) ౧౦. జిల్లాల పోలీసు ౧౧. వ్యవసాయశాఖ ౧౨. పరిశ్రమలు (ఇండస్ట్రీస్.)

## ౨. సదరుల్ మహాం ఫైనాన్సు

అంటే ఫైనాన్సు మెంబరు. ఈ మెంబరు నిర్వహించే డిపార్టు మెంట్లు ౧. సదరుమహాసబీ (అక్కౌంట్సు) ౨. దీవానీ దఫ్తర్ ౩. టంకసాల (ఈడిపార్టుమెంటులో నాణెములూ, మెరుపూ, నోట్లూ, తూకములూ చేరివున్నవి) ౪. రెయిల్వేలు.

## ౩. సదరుల్ మహాం అదాలత్ వ ఉమూరె ఆమ్మా

అంటే హోం సెక్రటేరియట్. ఈ మెంబరు నిర్వహించే డిపార్టు మెంట్లు ౧. పోస్టులు ౨. అదాలతుల్ ఆలియా (హైకోర్టు) ౩. ముద్రాలయము, స్టేషనరీ ౪. ఆసారెకదీమా (పురాతత్వశాఖ) ౫. ఉమూరె మజహబీ (మతశాఖ.)

## ౪. సదరుల్ మహాం ఫౌజ్ వ తిబాబత్

అంటే సైన్యశాఖా, ఆరోగ్యశాఖాను. ఈ మెంబరు నిర్వహించే డిపార్టుమెంట్లు ౧. సైన్యం (బా ఖాయిదా Regular) బేఖాయిదా (Irregular) ౨. యునానీవైద్యశాఖ ౩. అల్లోపతీ వైద్యశాఖ.

## ౫. సదరుల్ మహాం తామీరాత్

అంటే పబ్లిక్ వర్క్సు మెంబరు. ఈ మెంబరు నిర్వహించే డిపార్టు మెంట్లు. ౧. నీటివసతులు (ఇరిగేషన్) ౨. డ్రెయినేజీ (మురుగు పారుదల) ౩. టెలిఫోను.

## ౬. సదరుల్ మహాం సియాసియాత్

అంటే రాజకీయశాఖ మెంబరు. ఈ మెంబరు నిర్వహించే డిపార్టుమెంట్లు. ౧. రాజకీయశాఖ (పొలిటికల్ డిపార్టుమెంటు) ౨. సఫాయి (మునిసిపాల్టీలు) ౩. ఆరాయిష్ బల్దా (సిటీ ఇంప్రూవు మెంటు బోర్డు) ౪. ప్రకటనలు (ఇన్ఫర్మేషనుబ్యూరో).

## కచేరీలు

నిజాము రాష్ట్రంలో ౧. దీవానీ అనీ, ౨. సర్ఫేఖాస్ అనీ, ౩. పాయెగాలు అనీ, ౪. జాగీర్లు అనీ నాలుగు విధాలైన రాజ్యాంగా లున్నవి.

దీవానీ అనే దాన్నే ఖాల్సా అంటారు. ఈ రాజ్యాంగం ప్రభువు సొంతంగా నియమించిన అధికారుల వశంలో వున్నది. ఇక్కడ దీనికి సంబంధించిన కచేరీల వివరా లిస్తాను.

## రాజధానిలో

హైదరాబాదు నగరంలో యీక్రింది కచేరీ లున్నవి.

౧. కొత్వాలీబల్దా (సిటీపోలీసు) ౨. జిల్లాపోలీసుకచేరీ ౩. రెవెన్యూఆఫీసు ౪. హైకోర్టు ౫. దీవానీబల్దా (సిటీ సివిల్ కోర్టు) ౬. ఫౌజ్దారీ బల్దా (సిటీ క్రిమినల్ కోర్టు) ౭. దారుల్ఖజా (ఖాజీగారి కోర్టు) ౮. ఉమూరె మజహబీ (మతశాఖ) ౯. వ్యవసాయపుకచేరీ ౧౦. ఫైనాన్సు ఆఫీసు ౧౧. టంకసాల, ఎలెక్ట్రిసిటీ ౧౨. ఇంజనీరింగుకచేరీ ౧౩. ఉస్మానియా యునివర్సిటీ ౧౪. శాసనసభ ౧౫. కార్యనిర్వాహకసభ (బాబెహుకూమత్) ౧౬. వాణిజ్య, పరిశ్రమలశాఖ ౧౭. ఇన్ఫర్మేషనుబ్యూరో ౧౮. సిటీఇంప్రూవుమెంటుబోర్డు (ఆరాయిషేబల్దా) ౧౯. సఫాయి (సిటీకార్పొరేషను) ౨౦. ఆబ్కారీ ౨౧. అడవుల కచేరీ ౨౨. కరోడగిరీ (కస్టమ్సు) ౨౩. విద్యాశాఖ ౨౪. జంతువుల చికిత్సశాఖ ౨౫. వైద్యారోగ్యాలశాఖ ౨౬. బందోబస్తు (సెటల్‌మెంటు) ౨౭. తామీరాత్ (డి. పి. డబ్ల్యు)

## సుబాలలో

౧. సుబేదారీ ౨. న్యాయశాఖ ౩. విద్యాశాఖ ౪. పోస్టు ౫. ఆబ్కారీ.

## జిల్లాపట్నాలలో

౧. మాల్ (రెవెన్యూ) ౨. న్యాయశాఖ ౩. విద్య ౪. డి. పి. డబ్ల్యు ౫. పోస్టు ౬. కస్టమ్సు (ఇది అన్ని జిల్లా పట్నాలలోనూ వుండదు) ౭. ఆబ్కారీ ౮. వైద్యశాఖ.

వైశాల్యం యెక్కువైన జిల్లాలలో రెండేసీ మూడేసీ డివిజను లుంటాయి. వీటిలో జిల్లాకలెక్టర్ల మదద్గారులు (అసిస్టెంటు కలెక్టర్లు) ఉంటారు. వీరు రెవెన్యూవిషయాలు చూసుకుంటారు.

## తాలూకాపట్నాలలో

౧. తాలూకాకచేరీ (తహశ్శీలుదారు చేతికింద పేష్కారూ గిర్దావరులూ మొదలయినవారు పనిచేస్తూ వుంటారు) ౨. న్యాయశాఖ అంటే మున్సిఫ్‌కోర్టు ౩. పోలీసు ౪. డి. పి. డబ్ల్యు ౫. ఆస్పత్రులు ౬. రిజిస్ట్రేషన్ కచేరీ.

## గ్రామాలలో

౧. పోలీసుపటేలు ౨. మాలీపటేలు ౩. పట్వారీ ౪. సేత్‌సంధీ లేక తలారి.

ఈ గ్రామాధికారాలు వంశపారంపర్యంగానూ, జ్యేష్ఠాధిష్ఠితంగానూ వస్తాయి.

# తెలుగు డైరెక్టర్లు

కొడవటిగంటి కుటుంబరావు

ఒకరిప్రశ్నకు "ప్రజామిత్ర" లో సమాధానంరాస్తూ, తెలుగు టాకీబాధ్యత యావత్తూ డైరెక్టరు దేనని శ్రీ గూడవల్లి రామబ్రహ్మం గారన్నారు.

ఇది తప్పునిసరికావచ్చును; అయినా అన్నివిధాలా శోచనీయమైన విషయమే. ఎందుకంటే టాకీకి చాలా అంగబలం కావాలి. డైరెక్టరు తనే ప్రొడ్యూసరుగానూ, ప్రొడక్షను మానేజరుగానూ, కథకుడుగానూ, సినారియోరైటరుగానూ, కాస్టింగుడైరెక్టరుగానూ వ్యవహరించాలంటే చిక్కులపాలవుతాడు, ఎంతమొనగాడయినా సరే.

పైగా మన డైరెక్టర్లలో అంతటిమొనగాళ్ళుకూడా ఎవరూ లేరు. టాకీకి పూర్తిసంబంధంగల కథలూ సంగీతమూ మొదలైన వాటిలో మన డైరెక్టర్ల అభిరుచి మన ప్రేక్షకుల అభిరుచికి అట్టే భిన్నంగాఉన్నదనుకోవటానికి అవకాశం కనిపించదు.

పైపెట్టునఉండి ఇతరులుచేసిన పనికి సమ్మతిఇవ్వటానికే డైరెక్టరుకు మంచిశాస్త్రీయమైన అభిరుచులుండాలి. టాకీ నిర్మాణం యొక్క వివిధశాఖలలో చెయ్యిపెట్టి పనిచెయ్యటానికి ఎంత ప్రతిభకావలిసిందీ ఎటువంటి శిల్పనైపుణ్యం కావలిసిందీ మనం సులభంగా ఊహించుకోవచ్చును.

అందుచేత టాకీనిర్మాణపు ప్రతిశాఖలోనూ ఒకసమర్థుడూ బాధ్యుడూ అయినవాడుండాలి. వీరంతా చేసే ప్రయత్నాన్ని కేంద్రీకరింపచేసి డైరెక్టరు తనపని నెరవేర్చుకుంటాడు.

అటువంటి అంగబలంలేకుండానే చిత్రంతియ్యటానికి డైరెక్టరును నియోగిస్తే—నియోగించవలిసివస్తే—చిత్రం ఏదోవిధంగా బయటికి రాకపోదు. కాని అందులో ఉన్నలోపాలకు డైరెక్టరును తప్పు పట్టి లాభంలేదు. రాజ్యాంగశాఖామంత్రులు లేకుండా పరిపాలనా బాధ్యత యావత్తూ ప్రధానిమీద వేస్తే ఆదర్శపరిపాలన అసంభవం.

కాని డైరెక్టరుకు తనసహాయులు చేసే పనినిగురించి ఏమీ తెలియకపోయినప్పుడుమాత్రం డైరెక్టరును సమర్థించలేం. సినారియోరైటరూ, కామెరామాన్, ఎడిటర్ మొదలైనవాళ్ళుచేసే పొరపాట్లను కనిపెట్టలేని డైరెక్టరు అసమర్థుడు. కాని అక్కడకూడా అతన్ని మనం క్షమించవచ్చును.

కథను చిత్రంగా మార్చేపని సాంతంగా డైరెక్టరుది. ఏసంఘటనకు psychological value ఎంతో, ఏపాత్రయొక్క వ్యక్తిత్వం ఎటువంటిదో, ఏఘట్టం ప్రేక్షకులకు ఎట్లాప్రదర్శించాలో, ఏపాత్ర ఎప్పుడు ఎంతభావోద్రేకాన్ని ప్రదర్శించాలో సున్నితమైన త్రాసుతో తూచేబాధ్యత డైరెక్టరుది. ఈపనిలో డైరెక్టరుకు ఎవరూ సహాయంరారు సరేకదా, ఈ లోపాలను తరవాత సవరణ చేసేవాళ్ళుకూడా ఉండరు—సూక్ష్మంగా ఎడిటరుతప్ప.

దురదృష్టవశాత్తూ డైరెక్టరు ఇతరులమాదిరిగా అనుభవంతో అభివృద్ధిపొందలేడు. అతని అనుభవం ఎక్కువభాగం స్టూడియోకు బయటేఉంటుందిగాని లోపలఉండదు. ఎన్నివందల చిత్రాలు డైరెక్టుచేసినవాడుకూడా తనకు అనుభవంలోలేని సంఘటననూ పాత్రలనూ డైరెక్టుచేయ్యలేడు. అందుచేత నాలుగు చిత్రాలను తగలవేస్తే డైరెక్టరనుకోవటానికి అవకాశంలేదు.

పైనచెప్పినవాటికి దృష్టాంతాలు మన టాకీలలోనుంచి ఎత్తి చూపవచ్చును. అట్లాచెయ్యటంవల్ల వ్యక్తులకు బాధకలిగించటమే తప్ప మరేమీఉండదు కనక వాటిని పఠితలకే వదిలిపెడుతున్నాను.

డైరెక్టర్లు తమ బాధ్యతను నిర్వర్తించనప్పుడల్లా అది వారి అసమర్థతే ననుకోవలిసిన అవసరంలేదు. డైరెక్టర్లు బుద్ధిపూర్వకంగా చేసే తప్పులు చాలాఉంటై. అందులో ఎక్కువభాగం పెట్టుబడిదార్లను తృప్తిపరచటానికీ బాగుచెయ్యటానికీ చేసేవి.

పెట్టుబడిదార్లు కళకోసం నశించిపోవాలని నామతంకాదు. కాని టాకీప్రయోజనాలకూ టాకీపరిశ్రమప్రయోజనాలకూ కించిత్తు తేడాఉండటంవల్ల పెట్టుబడిదార్లకోసం చెయ్యవలిసేవచ్చే త్యాగం ప్రేక్షకులకు రుచించదేమోనని నాభయం.

ఇదంతాకూడా కాక టాకీపరిశ్రమ, ముఖ్యంగా మనరాష్ట్రంలో నాథుడులేని పరిశ్రమ. దానికి నిదర్శనమేమిటంటే ఈపరిశ్రమలో కొన్నికొన్ని పొరపాట్లు వాటంతటఅవే జరిగిపోతై. వాటికి ప్రత్యేకించి కారకులుగాని నివారకులుగాని ఎవరూఉండరు. ఇటువంటి పొరపాట్లు హెచ్చుభాగం షూటింగుకు సంబంధించినవి అయిఉండటంవల్ల వాటికి డైరెక్టరునే బాధ్యుణ్ని చెయ్యవలిసివస్తుంది.

"తీరాచెయ్యవలిసివచ్చేటప్పటికి ఎంతశ్రమఉందో చెప్పేవాళ్లకేంతెలుస్తుంది?" అనే డైరెక్టర్లంతా వాటికవిగా జరిగే పొరపాట్లు చాటున, తమ అంతరాత్మలను భద్రపరుస్తూ ఉంటారు.

---

## రెవ్యూకోసం పుస్తకాలు

ప్రబుద్ధాంధ్రకు, రెవ్యూనిమిత్తం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు-ఒకటి రెవ్యూ చేసేవారి నిమిత్తమూ మరొకటి పత్రికాభాండాగారం నిమిత్తమూ పంపాలి. ఒక్కప్రతే వచ్చే పుస్తకాలు రెవ్యూ చెయ్యబడవు. రెవ్యూలు సమర్థులచేతనే రాయిస్తాము; కాని యెలాంటి పరిస్థితులలోనూ వాటిమీద జవాబులూ పునర్విమర్శలూ ప్రకటించము.

సంపాదకుడు

# ఆత్మరక్ష

భీమన, బి. ఏ

స్థలం — పొలంలో

వేళ — ఊరమసకల వేళ.

పాత్రలు — గడ్డపార, పాగ, కొడవలి, కత్తి, తట్ట, బండి, ఒక యెద్దు, ఒక కూలీమనిషి.

కూలీ — దిక్కుమాలిన జన్మం, దరిద్రజన్మం, తుచ్ఛజన్మం, ఛండాలజన్మం, ఛీ, ఎందుకు బ్రతికి ? ఎందుకు ? ఎందుకు ? ఎందుకు ? పొడుచుకు చస్తే — ఏదీ గడ్డపార — (చెయ్యిచాస్తాడు)

గడ్డపార — మనిషీ ! మనిషి ! అయ్యో — పిచ్చిమనిషి !! ఏం చేస్తున్నావు ? మతిలేదూ నీకు ?

కూలీ — ఆఁ ? మనిషిని ? నేనా ? నేనామనిషిని ? నేను మనిషిని కాను, కాను. ముమ్మాటికీ నేను మనిషినికాను.

గడ్డపార — నీవు — మనిషివి.

కూలీ — అయ్యో ! ఇక నేను ఎలా చావను ? పీక కోసేసుకుంటా. ఏదీ కొడవలి ? (చెయ్యి చాస్తాడు)

కొడవలి — హాఁ ! కూలీ ! వద్దు. నీవు చచ్చిపోవద్దు. నీ పెళ్లాం బొట్టులేని, పసుపులేని, దీనవదనం నేను చూడలేను. చూడలేను — కూలీ — నేను చూడలేను. నీవు చచ్చిపోవద్దు, నీవు మనిషివే.

కూలీ — నీవు పొరపడుతున్నావు — కొడవలీ ! పొరపడుతున్నావు. పెళ్లాం ! ఎంత అందగత్తే ! ఆ అందమే నాకు శత్రువైంది. ఎట్టి పవిత్రశీల ! ఆ శీలమే ఆమెకు ప్రాణాంతక మవుతున్నది. ఆమెకు ముందు నేనే చచ్చిపోతా, చచ్చిపోతాను. బ్రతకలేను. ఈఅవమానాలు — ఈదాస్యాలు — భరిస్తూ — బ్రతకలేను.

కొడవలి — వద్దు. వద్దు. కూలీ ! నీవు మనిషివి. మగవాడివి. నీకు అవమానమా ? చావా ? సిగ్గు. సిగ్గు.

కూలీ — నేను మనిషినా ? మగవాడినా ? కాదు కాదు. మీతో పాటు నే నొక పనిముట్టుని, మనిషినికాను. కామందుకి బానిసను, పొట్టకూటికి పౌరుషం చంపుకొన్న పశువును, నేను బ్రతకలేను. ఈ కొలిమిగోతిలో కూరుకుపోతాను. ఓ ఉప్పరితట్టా ! నన్ను పూడ్చిపెట్టు. ఓ పారా ! ఈ గోతిని తవ్వు.

పార — మనిషి ఇంతనీచుడా ? మగవాడు ఇంత పిరికిపోతా ?

తట్ట — ఝడిసిపోకు — నరుడా ! ఝడిసిపోకు. నీ భార్యని ఆ కామందు విసవుకోరల్లోకి తోసేసి నువ్వు చచ్చిపోతావా ?

కొడవలి — నీ భార్యని రక్షించుకో.

పార — నీ ఆకటి మంటలు చల్లార్చుకో.

కూలీ — నా నిజసంగతి మీకు తెలీదు. నేను శవాన్ని. ఏమీ చెయ్యలేను. బండీ ! నా పీకమీదనుంచి నీ చక్రాన్ని దొర్లించు. ఎద్దూ ! నా దుడుకు గుండెను గలకదొక్కు — నీ కొమ్ములతో నా ఆకటి పేగుల్ని చెండాడు.

బండి — నేను కదలను.

ఎద్దు — నేను వినను.

కూలీ — నేను కదిలిస్తాను. నేను వినిపిస్తాను.

కత్తి — నరుకుతాను. మొనగాడివి ? జాగ్రత్త !

కూలీ — ఎవరు నువ్వు ?

కత్తి — నీ యజమానిని. కత్తిని, ఈ బండీ, ఈ ఎద్దూ, నావి. నా కామందువి. ఈరెంటినీ ఏమన్నా అన్నావా — నరుకుతాను. నీ గడ్డపారనీ — నీపారనీ — నీ కొడవలినీ — నీతట్టనీ — ఏమన్నా అనుకో. అవన్నీ నీవి.

కూలీ — నరుకుతావా ? కత్తీ ! నా పాలిట దేవుడివై వచ్చావు. నాకు కావలసిన వరం మరణం. నరుకు, ఇదిగో నాతల. ఎంతో మంది నిరంకుశప్రభువుల ఎదుట వంగి వంగి సలాములు పెట్టిన నా తల ! ఇదిగో. నరికెయ్యి. నా దాస్య జీవనంతో పంకిలమై పోయిన ఈ భూమిని నాకంఠ రక్తంతో కడిగివెయ్యి. ఆలస్యం సహించలేను రా. రా. ఇదిగో — బానిసతల.

కత్తి — ఊరికే నిన్ను, వదకను ఆ బండినీ — ఆ ఎద్దునీ సమీపించకు.

కూలీ — ఇదిగో సమీపిస్తున్నాను. బండిని కదిలిస్తాను — ఎద్దును వినిపిస్తాను (లేస్తాడు)

కత్తి — నరుకుతాను (లేస్తుంది)

గడ్డపార — ఊఁ ! కత్తీ ! నరుకుతావ్ ? నరుకు (కత్తిమీద పడుతుంది. కత్తి రెండుముక్కలవుతుంది)

పార — (పకపకా నవ్వుతూ) గొయ్యితీస్తున్నాను.

గడ్డపార — పడతోస్తున్నాను.

తట్ట — మట్టి కప్పుతున్నాను.

కొడవలి — కత్తి ! పొగరుపోతు ! నశించింది. దీని సమాధిమీద చిహ్నంగా నిలుస్తున్నాను నేను.

కూలీ — అయ్యో ! పాపం — కత్తి ! పోయింది. పొగరుపోతు నిరంకుశత్వానికి కడకు ఏగతో అగతే పట్టింది. పోయింది కాని, మీరేం — నన్ను చావనియ్యరు ?

ఎద్దు — కత్తి — చచ్చిందా ? బ్రతికాం.

బండి — అమ్మయ్యా !

కూలీ — కత్తి చచ్చింది. అలానే మీరు నన్ను చంపండి. లేకపోతే మిమ్మల్ని అందర్నీ నేను చంపుతాను.

బండీ — మేము నీ స్నేహితులం.

గడ్డపార — ఔను. స్నేహితులం. కాబట్టే నీవు మమ్మల్ని చంపుతావు. స్నేహితుల్నే చంపాలి, చంపు. ముందు మమ్మల్ని చంపి నీవుచావు.

కొడవలి — ముందు నీభార్యని చంపి నీవుచావు. ముందు మేము — తర్వాత నీభార్య — తర్వాత నీవు.

తట్ట — మేం వుండబట్టే నీకీ కూలీగతి — ఈ దుస్థితి — ఈశ్రమ — ఈ కడుపుమంట.

పార — ఔను. మేమే లేకపోతే, నీవు ఏ జమీందారువో అయి వుండేవాడివి. మమ్మల్ని పాతిపెట్టెయ్యి, త్వరగా — త్వరగా.

ఎద్దు—నాకు బుద్ధిపుట్టి—నా పౌరుషాన్నీ, వీర్యాన్నీ చంపి—నా చేత బళ్లులాగించి — అరకలు దున్నించి — మోటలు ఈడ్పించి—చంపుతున్నాడు కామందు. నీకు బుద్ధిపుట్టలేదే? నీవు నాకు లాగ ఎందుకు లొంగి వుండవలసి వచ్చిందా అని ఆలోచిస్తున్నాను.

కూలీ—ఎద్దు మాట్లాడడంలేదు.

బండి—ఎద్దుకు నా సానుభూతి.

గడ్డపార—బండితో నే నేకీభవిస్తాను.

పార—గడ్డపారతో నేను చెయ్యి కలుపుతాను.

పార—కొడవలిని నేను బలపరుస్తాను.

తట్ట—పారను నేను వెన్నాడతాను.

కూలీ—అయితే నాగతి?

ఎద్దు—మే మంతా నీ సేవకులము కామా?

కూలీ—కాదు. కాదు. నేనే మీ అందరి సేవకుణ్ణి. మీ వెంట నుండి—మీ సేవచేస్తూ—కామందుని తృప్తిపరచాలి గద! మీతో పాటు నే నొక పనిముట్టును గద!

బండి—ఇందాక నే మమ్మల్ని అందరినీ కలిపి చంపుతా నన్నావు కద?

కూలీ—నన్ను మీరు చంపకపోతే—నా కష్టాలు మీరు గట్టెక్కించకపోతే. రండి మీరంతా కలిసి నన్ను చంపెయ్యండి.

తట్ట—చంపము.

కూలీ—కాచుకోండి. మిమ్మల్ని చంపుతాను.

ఎద్దు—నా సందేహం తీరింది.

కూలీ—ఏం?

ఎద్దు—నీవు వుత్తి చవటవు. నిన్ను కష్టపెట్టేవాళ్లని ఎదిరించలేక, మనిషి ననేమాట మరిచిపోయి, మగవాడి నన్న తలంపే వీడి, గద్దించి నీహక్కులు పొందలేక—నీకు లోకువైన మమ్మల్నా చంపుతావు?

బండి—ఒకేసారి ఒకచోట బానిసవు, ఒకచోట యజమానివి, కాగలవా? ఒకచోట పిరికిపందవు, ఒకచోట వీరుడివీ కాగలవా?

గడ్డపార—మావంటి జీవంలేనివాటికే సాహసమూ, పౌరుషమూ వుంటే, కూలీ! మనుష్యుడివి నీవింతచప్పబడిపోయావేం?

బండి—దాస్యం నేర్చుకున్నాడు. తగులబడిపోయింది ఇతడి మానవత్వం.

కూలీ—ఔను. మానవత్వం చచ్చినవాడు బ్రతకడమెందుకని చచ్చిపోతున్నాను. నామూలాన మానవసంఘం కళంకం కాకూడదు ఓమిత్రములారా! సెలవు. మీరు నన్ను చంపరు. నేనే ఊపిరి బిగబట్టి నవద్వారాలూ బంధించి చచ్చిపోతున్నాను. మీకు కావలిస్తే నాభార్యను పతితకాకుండా కాపాడండి. నేను మాడలేను. ఏమీచెయ్యలేను. పొగడ్తలు అలవాటుపడిన నానోటికి పురుషవాక్కులురావు. చాకిరీ అలవాటుపడిన నాచేతికి చావమోదడంరాదు. కన్నీరు అలవాటుపడిన నాకంటికి తీవ్రదృష్టి చేతకాదు. చెప్పిన పనిమాత్రమే చెయ్యడానికి అలవాటుపడ్డ నాశరీరం స్వతంత్రించి పనిచెయ్యలేదు. ఇక నేనెందుకు బ్రతికి? ఇదిగో చచ్చిపోతున్నాను. (ఊపిరి బిగబట్టుకొని కూర్చుంటాడు.) బండి, ఎద్దు, పార, మొదలైనవన్నీ అతడిచుట్టూ మూగి విచారిస్తూ వుంటాయి. కూలీభార్య లికూ వస్తుంది.)

లికూ—అయ్యో! నాభర్త ఇలాకూర్చున్నాడేం? ఇంతప్రొద్దుపోయినా ఇంటికి రాకుండా—నాఅందం, నాశీలం, నాదేవుడికి ఎంత కష్టం తెచ్చిపెట్టాయి!

తట్ట—నిన్నుగురించే ఇతడు చచ్చిపోతానంటున్నాడు. చచ్చిపోవడానికేనట అలాకూర్చున్నాడు.

లికూ—నన్నుగురించా? నేనే ముందుచచ్చిపోతాను. ఎందుకు బ్రతకడం? ఎవర్ని వుద్ధరించడానికి? తృప్తా? సుఖమా? ప్రేమా? ఆనందమా? అన్నింటికీ ఈకామందులు అడ్డే. ఇదిగో చచ్చిపోతున్నాను.

(కామందు వస్తాడు.)

కామందు—ఎవరక్కడ? లికూ! నీవా?

(పార, బండీ, వగైరాలు గడగడ వణుకుతాయి.)

లికూ—ఔను.

కామందు—మంచిసమయానికే వచ్చావే! నన్న తిరస్కరించి పోయిన నీకు ఈరాత్రికి దయగలిగిందా?

లికూ—నేను నాభర్తకోసం వచ్చాను.

కామందు—హ హ హ కాని నన్ను భర్తఅనకు. నాకు పెళ్లాం ఒకర్తవుందిలే. ప్రియుడుఅను.

లికూ—ఛీ. నీచుడా! నీకోసంకాదు. నాభర్త ఇక్కడే వున్నాడు. ఇతడికోసం.

కామందు—ఇక్కడా? నాకు అడ్డమా? ఏడీ వాణ్ణి నరుకుతాను. కత్తి! కత్తీ! (పిలుస్తాడు.)

కత్తి—ఇక్కడ, ఇక్కడ, నీకాళ్ళక్రింద. (సమాధిలోనుంచి పలుకుతుంది.)

కామందు—కాళ్ళక్రింద? నీకీగతి కల్పించిన దుర్మార్గులెవరు—చంపుతాను. (సమాధితీయబోతాడు. కొడవలి అతడి రెండు చేతులూకోస్తుంది.)

కామందు—మోసం. మోసం. నాపనిముట్లే నాకు ఎదురుతిరగడం! (లికూతో) ఇదంతా నీగురించే. ముందు నిన్ను చెరిచి, వాణ్ణి నరికి, వీటన్నిటినీ విరిచిపారేస్తా. (లికూమీద పడతాడు.)

గడ్డపార—(మెల్లిగా కూలీతో) వెళ్ళు. వెళ్ళు. నన్నుతీసుకుని అతడిని పొడు. నీభార్యశీలం రక్షించుకో.

కూలీ—నేను—వెళ్ళలేను. అతడు నాకామందు.

గడ్డపార—(లికూదగ్గరకు ఉరికి) ఇదిగో నేను. నన్నుతీసుకో. (కామందుకు అడ్డుగా, సూటిగా నిలుస్తుంది.)

లికూ—ఔను. నాశీలం రక్షించుకోడానికి నేను నిన్ను ఉపయోగిస్తాను. (గడ్డపారను చేతపట్టుతుంది. కళ్ళవెంట నిప్పులు కురుస్తాయి. తట్ట, పార, ఎద్దు, బండీ కామందుమీదికి లంఘిస్తాయి.)

# ఉద్యోగాల విషయమై ఆంధ్రులకు జరుగుతున్న అన్యాయం

బెజవాడ ఆంధ్రపార్లమెంటువారీకింది అంకెలు ప్రకటిస్తున్నారు.

మద్రాస్ గజటెడ్ ఆఫీసర్ల లిస్టు.

కొన్ని డిపార్టుమెంటులలో తెలుగువారు అసలే లేరు. ఉన్న వాటిలో తక్కువ.

మద్రాస్ హెడ్ క్వార్టర్సులో:—

| డిపార్టుమెంటు | అరవలు మళయాళీలు కలిసి | ఆంధ్రులు |
|---|---|---|
| ౧. చెన్నపురి సెక్రటేరియట్ | ౨౪ | ౧ |
| ౨. జుడిషల్ డిపార్టుమెంటు | ౫ | ౧ |
| ౩. లా ఆఫీసర్లు | ౬ | ౧ |
| ౪. పోలీసుడిపార్టుమెంటు | ౭ | ౧ |
| ౫. చెన్నపురిమెడికల్ కాలేజీ | ౪౦ | ౪ |
| ౬. చెన్నపురిజనరల్ హాస్పిటల్ | ౨౧ | ౨ |
| ౭. వెటరినరీడిపార్టుమెంటు | ౭ | ౦ |
| ౮. పి. డబ్ల్యు. డి. | ౨౪ | ౧ |
| ౯. ఇండియన్ ఆడిట్ డిపార్టుమెంటు | ౧౮ | ౦ |
| ౧౦. చాచాఅపాయంటుడిపార్టుమెంటు | ౧౬ | ౨ |
| ౧౧. ఫారిన్ సర్వీసెస్, నైజాంఎస్టేటు మేనేజర్సు వగైరా | ౯ | ౦ |

పూర్తిగా గవర్నమెంటువి కాని ఇంపీరియల్ బ్యాంకు, ఎం. ఎస్. ఎం రయిల్వే. ఎస్. ఐ. రయిల్వే వగైరా వాటిని గురించి వ్రాయలేదు. అదీగాక చిన్న వుద్యోగస్థులవి వ్రాయలేదు.

## వివిధజిల్లాలలోని ఉద్యోగస్థులు ఆఫీసర్లు

| అరవమళయాళ జిల్లాలు | మహమ్మదీయులు | యూరపియనులు | అరవలు మళయాళీలు | ఆంధ్రులు |
|---|---|---|---|---|
| ౧. నార్తుఆర్కాటు | ౫ | ౧౦ | ౩౦ | ౪ |
| ౨. సౌతార్కాటు | ౨ | ౫ | ౪౨ | ౦ |
| ౩. చెంగల్పట్టు | ౬ | ౧౩ | ౪౭ | ౨ |
| ౪. కోయంబుత్తూరు | ౫ | ౨౧ | ౮౨ | ౬ |
| ౫. సౌత్ కనరా | ౫ | ౧౫ | ౩౦ | ౩ |
| ౬. మధుర | ౩ | ౧౩ | ౩౯ | ౩ |
| ౭. మలబారు | ౩ | ౩౬ | ౬౮ | ౨ |
| ౮. నీలగిరీస్ | ౨ | ౨౬ | ౧౯ | ౨ |
| ౯. రామ్నాడ్ | ౨ | ౬ | ౩౫ | ౪ |
| ౧౦. సేలం | ౨ | ౧౬ | ౩౫ | ౪ |
| ౧౧. తంజావూరు | ౬ | ౧౨ | ౪౦ | ౪ |
| ౧౨. తిన్నెవెల్లి | ౫ | ౧౪ | ౩౪ | ౨ |
| ౧౩. త్రిచినాపల్లి | ౩ | ౧౪ | ౩౫ | ౧ |
| మొత్తం | ౪౯ | ౨౦౧ | ౫౬౬ | ౩౭ |
| తెలుగుజిల్లాలు | | | | |
| ౧. అనంతపూరు | ౩ | ౩ | ౨౦ | ౪ |
| ౨. బళ్లారి | ౬ | ౧౫ | ౧౬ | ౬ |
| ౩. చిత్తూరు | ౦ | ౯ | ౧౮ | ౩ |
| ౪. కడప | ౬ | ౨ | ౨౦ | ౬ |
| ౫. తూర్పుగోదావరి | ౮ | ౧౫ | ౪౯ | ౧౬ |
| ౬. పశ్చిమగోదావరి | ౩ | ౪ | ౨౧ | ౮ |
| ౭. గుంటూరు | ౨ | ౩ | ౩౧ | ౯ |
| ౮. కృష్ణా | ౪ | ౬ | ౩౦ | ౧౦ |
| ౯. కర్నూలు | ౨ | ౪ | ౨౪ | ౭ |
| ౧౦. విశాఖపట్నం | ౭ | ౧౮ | ౩౫ | ౨౨ |
| ౧౧. చెన్నపురిజిల్లా | ౫ | ౨౩ | ౩౮ | ౬. |
| మొత్తం | ౪౬ | ౧౦౨ | ౩౦౨ | ౯౭ |
| రాజధాని మొత్తం | ౧౦౦ | ౩౧౬ | ౮౮౮ | ౧౪౨ |

---

# మాతృభాషాభిమానము

జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ

స్వభాషాభిమాన మెంత సుగుణ మను భావము చిరకాలము నుండియు మన దేశములో కలదు. సుమారు వేయి సంవత్సరముల క్రిందటనే నన్నయభట్టు "స్వస్థానవేషభాషాభిమతా స్సన్తః" అని చెప్పియున్నాడు. ప్రజలలో నీగుణ ముండుట జాత్యభ్యుదయ హేతువని యందఱు నంగీకరించుచున్నారు. స్వభాషానిరసనము, పరభాషావ్యామోహము జాతిపతన హేతువులు. మనదేశములో వివిధ ప్రాంతీయభాషలకు బదులుగ నాంగ్లభాషను ప్రజ లభిమానించు నట్లు చేయుటో నిచట నాంగ్లపరిపాలనకు మంచి యాధార మేర్పడు నని యాంగ్లేయు లాదిలోనే గ్రహించిరి. సుమారు ౧౩౦ సంవత్సరముల క్రిందట లార్డు మెకాలే గారి యుద్దేశముతోనే మన దేశములో నాంగ్లభాషావ్యామోహమును గల్గించుటకు సంకల్పించిరి. వారి కృషికి ఫలితముగనే మన కాంగ్లవిద్యాపద్ధతి వచ్చినది.

ఆత్మగౌరవము, మాతృభాషాభిమానము అనునవి కలసియే యుండును. మనదేశములో పరదేశభాషయందు వ్యవహారములు నడచుట లజ్జావహ మని మన నాయకులు కొంతకాలమునుండి

చెప్పుచున్నారు. మాతృభాషలకు తగిన స్థానము నిప్పింపవలె నని వారు బోధించుచున్నారు. వారు మనకు మార్గమును కూడ చూపి యున్నారు. నవయుగములో భారతీయులచే రచింపబడిన యుత్తమోత్తమగ్రంథములు మూడు; లోకమాన్యబాలగంగాధర తిలకుగారి గీతారహస్య మొకటి. రవీంద్రనాథటాగూరు గారి గీతాంజలి మరొకటి. గాంధిమహాత్ముని ఆత్మకథ మూడవది. ఈమూడును గూడ గ్రంథకర్తల యాయామాతృభాషలలో రచింపబడిన వనుట గమనింపదగిన యంశము. ఈమూడుగ్రంథములును గూడ నాంగ్లములోని కనువదింపబడి ప్రపంచవిఖ్యాతిని గడించినవి.

ఆంధ్రులకంటె మరియేరాష్ట్రమువారి కైనను మాతృభాషాభిమానము హెచ్చనియే తోచును. వారిలో వారు, ఆంగ్లము వచ్చి యున్నను గూడ మాతృభాషలోనే మాట్లాడుకొందురు. తెలుగు వారిలో నే మాత్ర మింగ్లీషు వచ్చిన వారైనను నింగ్లీషులో మాట్లాడుకొనుట కలదు. బంగాలీల మాతృభాషాభిమానము ప్రత్యేకముగ చెప్పదగినది. విశ్వవిద్యాలయస్నాతకోపన్యాసమును గూడ గతసంవత్సరము, రవీంద్రనాథటాగూరుగారు బంగాలీ భాషలోనే యొసగియుండిరి. మన యూనివర్సిటీలో నట్టి దింకను జరుగలేదు. అన్నిటికంటె ముఖ్యమైనది విశ్వవిద్యాలయసెనేటు సభలో చర్చలు తెలుగులో జరుగవలెను గదా? అందులకు గూడ తెలుగు పనికిరాలేదా? ఆంధ్రవిశ్వవిద్యాలయము బెజవాడలో నున్నపుడు సెనేటుచర్చలు తెలుగులో జరుగవలె నను తీర్మానము చర్చకు వచ్చెను. ఒక యూరోపియను సభ్యుడు తీర్మానమును బలపరచుచు తనవంటి వైదేశికు లీదేశపు భాషను నేర్చుకొనుట న్యాయ మనియు తమకొరకై చర్చ లింగ్లీషులో జరుగనక్కర లేదనియు నుడివిరి. ఆంధ్రభాషాభిమానమునకై వన్నెకెక్కిన యొక యాంధ్రప్రముఖుడు సెనేటులో నాతీర్మానము నెదిరించెను. తీర్మానము వీగిపోయెను. ఒకమూల తెలుగు నిట్లు వెనుకకు నెట్టుచు మరొకవైపున తెలుగు నుద్ధరింపవలె నని పెద్దమాటలను చెప్పుటవలన నేమియు లాభముండదు.

పరభాషాదాస్యము పోనిదే స్వభాషాభివృద్ధి నెట్లు చేయగలము?

మనవారికి పేర్లదగ్గరనుండియు పరభాషాదాస్యము కలదు. తెలుగుపేర్లయందు మనవారికి రుచి తొలగినది. ఏయజంతపద ప్రాచుర్యముచేత తెలుగు మధురమై "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అను బిరుదమునుపొందినదో యట్టి యజంతపదములు మనవారికి రుచించుటలేదు. మన దుర్ప్రత్యయమే మనకు వెగటైపోయినది. రాముడు, లక్ష్మన్న, వెంకయ్య మున్నగు నామము లరుదైపోవుచున్నవి. 'శివరాం' 'సత్యరంజన్' మున్నగు పేర్లు వాడుకలోనికి వచ్చుచున్నవి. 'వెంకటగోపాలము' అను తన పేరును 'వి. జి. పాల్.' అని మార్చుకొనుటకు నేటి యాంధ్రు డుత్సహించుచున్నాడు. స్త్రీల పేర్లు మారుట మరింత విషాదమును గలుగజేయుచున్నది. 'సీతమ్మ' 'పార్వతమ్మ' మున్నగు పేరుకూడ పోటయినవి. 'అమ్మ' కూడ పోయైన తర్వాత నాజాతి భవిష్యత్తెట్లుండునో యను భయము కలుగక మానదు. ఎక్కడనుండియో వచ్చిన 'బాయి' ఆదరణయోగ్య మైనది. ఇట్టి భావదాస్యమును పోగొట్టుకొనిననే కాని మాతృభాష కెట్లు గౌరవము సంపాదింపగలము?

పరభాషకు మనము చూపుచున్న గౌరవములో నూరవవంతైనను మాతృభాషకు చూపుట లేదనుట కిట్టి యుదాహరణముల నెన్నిటి నైనను చూపవచ్చును. ప్రస్తుతము మన యాంధ్రదేశములో వందల కొలది యువకులు ప్రతిసంవత్సరమువను దక్షిణభారతహిందీప్రచార సభవారి పరీక్షలకు వెళ్ళి యుం దుత్తీర్ణులగుచున్నారు. ఈపరీక్షలను జరుపుచున్న దక్షిణభారతహిందీప్రచారసభకు సంపన్నులైన యాంధ్రు లెందరో ధనసహాయము చేయుచున్నారు. కాని మన మాతృభాష యైన తెలుగులో జనసామాన్యమునకు పాండిత్యమును, జ్ఞానమును గల్గించుటకై ద. భా. హిం. ప్ర. సభవంటి సభ యొకటి మన కవసర మని గుర్తించి యట్టిదానిని స్థాపించుటకు పూనుకొనిన వారు మనలో లేరు. ఉత్తరహిందూస్థానములో హిందీసాహిత్య సమ్మేళన నడపు పరీక్షల కచటివారు చాలమంది వెళ్ళుచున్నారు. విశ్వవిద్యాలయములవారు, గవర్నమెంటువారు కూడ నాబిరుదములకు విలువ నిచ్చియున్నారు. ఆంధ్రములో కూడ నట్టి పరీక్షలను జరుపుట జనసామాన్యములో సాహిత్యజ్ఞానమును గల్గించుటకు తోడ్పడగలదు.

మన ప్రజలకు ఇంగ్లీషువ్యామోహము కొంత తగ్గుచున్న దని యానందింపదగిన యీసమయములో హిందీ వచ్చి మన మాతృభాషకు కొంత హానిని గల్గజేయుచుండుట శోచనీయము. రాష్ట్రీయ వ్యవహారము లన్నియు దేశభాషలోనే జరుగవలె నని కాంగ్రెసు వారి యభిప్రాయమై యుండగా నిక హిందీ నందరు నేర్చుకొనవలె నని చెప్పుట యెందులకో తెలియకున్నది. ఒక రాష్ట్రమునకును మరొక రాష్ట్రమునకును నడుమ జరుగు వ్యవహారము మాత్రమే హిందూస్థానిలో జరుగును. అట్లు రాష్ట్రాంతరసంబంధము గలవారు మిక్కిలి కొలది మందియే యుందురు. హిందీ మిక్కిలి సులువైన భాష యగుటచే వారి కావసర మెప్పుడు వచ్చిన నపుడే హిందీని నేర్చుకొనవచ్చును. మొదటి మూడుఫారములలోను బాలురందరును హిందూస్థానీ నేర్చుకొనుట వ్యర్థమే యగును. అజ్ఞానము వారికి తర్వాత నిలబడుటకు తగిన పరిస్థితులు కూడ మనదేశములో లేవు. అట్టివాని నిట గల్గింపవలె నన్నచో హిందీ పత్రికాప్రచారము హిందీసినీమాలు, హిందీనాటకాలు మున్నగువాని నిట ప్రోత్సహింపవలెను. అదియే తెనుగునకు గొప్ప దెబ్బ యగును. నేడు ఇంగ్లీషుచేత తెనుగు అణగద్రొక్కబడినట్లే యపుడది హిందూస్థానీ చేత నణగద్రొక్కబడును. కాన మొత్తముమీద హిందుస్థానీ మనకు వ్యర్థమైనను కావలెను లేదా యనర్థదాయక మైనను కావలెను.

మన కళాశాలలలోను పాఠశాలలలోను తెనుగునకు చూపబడుచున్న యగౌరవము ప్రతిభాషాభిమానికిని తలవంపులుగ నున్నది.

హైస్కూళ్ళలో నితరభాషలను బోధించుట కుపయోగింపబడుచున్న గంటలలో సగముకంటె తక్కువ గంటలే మాతృభాష బోధించుట కుపయోగింపబడుచున్నవి. కళాశాలలలో గూడ నట్లే యున్నది. ఆంగ్లకళాశాలలలో లెక్కలు, రసాయనశాస్త్రము, దేశచరిత్రలు మున్నగు నైచ్ఛికవిషయములను తీసికొని బి. ఏ. తరగతి చదువు వారి సంఖ్య నలుబది యేబది యిరువది యుండగా తెలుగు నైచ్ఛికముగ తీసికొని చదువువారి సంఖ్య యొకటియో రెండో యై యుండును.

ఇందాశ్చర్యము లేదు. ఏలన కెమిస్ట్రీ గ్రాడ్యుయేటుకును, మాథమెటిక్సు గ్రాడ్యుయేటుకును, హిస్టరీ గ్రాడ్యుయేటుకును గల యుద్యోగావకాశములు తెలుగుగ్రాడ్యుయేటుకు లేవు. కెమిస్ట్రీ గ్రాడ్యుయేటు బి. యిడి. ప్యాసగుచో నెలకు ౧౦౦ రూపాయిల జీతముమీద కెమిస్ట్రీటీచరు కాగలడు. అట్లే యితరగ్రాడ్యుయేట్లు కూడను. కాని తెలుగుగ్రాడ్యుయేటు మాత్రము బి. యిడి. ప్యాసయి ౧౦౦ రూపాయల జీతముమీద తెలుగుటీచరు కాలేడు. మనజిల్లాబోర్డు అధికారులు, గవర్నమెంటులో పెత్తనము వహించిన వారును మాతృభాషాభిమానము గలవారల మని చెప్పుకొనువారే కాని శక్తియున్నను నాచరణలో పెట్టని యభిమానముండి యేమి ప్రయోజనము ? తెలుగును ప్రత్యక్షముగ నిట్లు పరాభవించుచు నాంధ్రము నుద్ధరింపవలె నని చెప్పుచుండుట వ్యర్థము.

కళాశాలలలో గూడ తెలుగునకు మిగిలిన సబ్జక్టులకు కంటె న్యూనత కల్పింపబడినది. లెక్చరర్లందరితో బాటు తెలుగుపండితులకు జీతము లేదు. లెక్చరర్ల స్కేలు వేరు. పండితుల స్కేలు వేరు. తెలుగులో పండిట్సు పోస్టు వంటిది మాథమెటిక్సులో కాని కెమిస్ట్రీలో కాని మరియే విషయములో కాని లేదు. వానియందు లెక్చరర్సు పోస్టులే కలవు. ఆంధ్రోపాధ్యాయునకు జీత మెందులకు తక్కువ యనగా, ఆయనది లెక్చరర్సు పోస్టు కాదు. పండిట్సు పోస్టు అందురు. ఆ ‘పండిట్సు’ అను పదమును వాడు మనినవారెవరు ? ఆయనకు కూడ లెక్చరరనియే నామకరణము చేసి యితర లెక్చరర్లతో బాటాయనకు జీత మెందుల కీయరాదు ?

కళాశాలలలో తెలుగుపండితుల స్థితి యార్థికేతరవిషయములలో గూడ నీచముగనే యున్నది. యూనివర్సిటీ పరీక్షలు జరుగునపుడు ద్రష్టగ నుండుటకు కూడ తెలుగుపండితున కర్హత లేదని యూనివర్సిటీవారు నిర్ణయించిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయమే యాంధ్రము నింత నీచముగ చూచిన నింక చెప్పవలసిన దేమి యుండును ?

భాషేతరవిషయములను తెలుగులో బోధించుటకైనను మన విశ్వవిద్యాలయ మింకను పూనుకొనలేదు. యూనివర్సిటీలో నీ విషయమై వచ్చిన తీర్మానములో నుభయపక్షములకును సమసంఖ్యాక సమ్మతులు రాగా వైస్‌చాన్సలర్ శ్రీరెడ్డిగారి నిర్ణాయకసమ్మతితో తీర్మానము త్రోసివేయబడెను. ఇట్టి మార్పు నన్ని విశ్వవిద్యాలయములు నొకేసారి ప్రవేశపెట్టవలె నని శ్రీరెడ్డిగారి యభిప్రాయము. మద్రాసురాజధానిలో విశ్వవిద్యాలయము లన్నియు నైనను కలసి పనిచేయవలె ననియు నందులకు తాము ప్రయత్నింతుమనియు వారు చెప్పియున్నారు. కాని యింతవరకు నట్టి ప్రయత్నము జరిగినట్లు కన్పట్టదు.

ఎట్లయినను మనదేశములో నీనడుమ జరిగిన జాతీయతాప్రబోధమున కనుగుణమైనంత మాతృభాషాభివృద్ధి జరుగలేదనుట స్పష్టము. సాధారణముగ జాతీయతాప్రబోధనోద్యమములును మాతృభాషోద్ధరణోద్యమములును కలసియే యుండును. ఐర్లెండులో డీవలెరా నాయకత్వమున నడచిన జాతీయోద్యమములో ఐర్లెండుకు స్వీయభాషయైన గెయిలిక భాషను ఇంగ్లీషుభాష బారినుండి కాపాడుట యనునుద్యమముకూడ నొక యంగమై యుండెను. ఇప్పటికిని నది నడచుచున్నది. అది చాలవఱకు విజయవంతమైన దనియే చెప్పవచ్చును. మనదేశములో కూడ జాతీయోద్యమముతో బాటు మాతృభాషోద్యమము నడచుచున్నది కాని యది తగినంత వేగముతో నడచుట లేదు. ఆదిలో నాంగ్లభాషావాగ్ధోరణి కాటపట్టైన కాంగ్రెసులో నేడు హిందూస్థానీ ప్రాధాన్యము వహించుట ముదావహమైన విషయము. తదనుగుణముగ రాష్ట్రీయవ్యవహారములలో ప్రాంతీయభాషలకు ప్రాముఖ్యము వచ్చినది. కాని యింకను జరుగవలసిన పని యెంతయో కలదు. జనసామాన్యములో విజ్ఞానచైతన్యము గలుగవలె నన్నచో మాతృభాషలోనికి సంస్కృతము, ఆంగ్లము హిందీ మున్నగు సమస్తభాషలలోని ముఖ్యగ్రంథములును నవతరింపవలెను. విజ్ఞానవ్యాపకసాధనముగ ప్రాంతీయభాషలను వృద్ధి నొందించుకొనుట యవసర మని నేటి పరిజ్ఞాత లందరు నంగీకరించి యున్నారు. ప్రాంతీయభాషలను, సభ్యతలను రక్షించుకొనుటయే కాక వృద్ధిపొందించుకొనుట కూడ నాధునికభావముల కనుకూలమే కాని ప్రతికూలము కాదు. విశాలదృక్పథమున కిది వ్యతిరేక మని యెవ్వరును తలంచుట లేదు. ఇదివరలో సారస్వతము లేని భాషలలో కూడ సారస్వతమును వెలయింపచేయుట కచ్చటివారు యత్నించుచున్నారు. ఈవిధముగనే యిపుడు తులుభాషలో సారస్వతము బయలుదేరుచున్నది.

ఎవరికైనను తమ మాతృభాష మాన్యమే. అందునను తెలుగువారి కది మరింత ముఖ్యము. చాలవిధములచే మనది గర్వింపదగిన భాష. మాట్లాడువారి సంఖ్యలో నిది భరతఖండములో మూడవది. మాధుర్యములో నిది యద్వితీయమై ‘ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు’ అని శ్లాఘింపబడినది. నేటి యేయుత్తరదేశభాషలోను సారస్వతము పుట్టకపూర్వమే నన్నయ భాగతము తెలుగులోని కవతరించినది. ఇట్టి ప్రాముఖ్యవిశేషవిరాజితమైన యాంధ్రభాష నాంధ్రులు మాతృభావముతో నారాధింతురు గాక యని కోరుచున్నాను.

# కట్టా వరదరాజకవి

## శేషాద్రి రమణకవులు

ఆధునికప్రసిద్ధకవులలో కట్టా వరదరాజకవి యొక్కఁడు. ఈయన రచించిన గ్రంథములలో నొక శ్రీరంగమాహాత్మ్యము మాత్రము కావ్యనిధి చెలికాని లచ్చారావుగారు ౧౯౨౧ లో ముద్రించి ఆంధ్ర లోకమునకు మహోపకారము గావించిరి. ఈయన రచించిన పరమ భాగవతచరిత్రము, పుండరీకచరిత్రము, ద్విపద రామాయణము ఇంక ను నముద్రితములుగ నున్నవి. ఆంధ్రవాఙ్మయసూచికవలన ద్విపద రామాయణము రెండు ప్రతులు, పుండరీకచరిత్రము (పద్యకావ్యము) ఒక ప్రతి తంజావూరు సరస్వతీమహాలులోఁ గలవని తెలియుచున్నది. పరమభాగవతచరిత్రము, శ్రీరంగమాహాత్మ్యములోఁ జేర్కొనఁబడి నది. ఈగ్రంథపు టునికియే తెలియదు. రుక్మాంగదచరిత్రము వరద రాజు రచించినది తంజావూరు లైబ్రరిలోఁ గలదని వాఙ్మయ సూచిక పేర్కొనుచున్నది గాని ఈతఁడు కట్టా వరదరాజో తద్భిన్నుఁడో విచారింపవలసి యున్నది. వరదరాజకృత ద్విపద రామాయణము, వాల్మీకిరామాయణమంత గొప్పగ్రంథము. మాకడ దీనికి రెండు ప్రతులు తాళపత్రగ్రంథములు కలవు. ఒకటి మాతృక, మఱియొకటి పుత్రిక గాన గ్రంథపాతములు లేకుండ సమగ్రగ్రంథము లభించినదను నుత్సాహముతో భాషాభిమానులెవరేని ప్రకటింప నుత్సహింపకపోరని శుద్ధప్రతి వ్రాయుచున్నాము.

వరదరాజు కవిత మృదుమధురము. ఇతఁడు సూర్యవంశ క్షత్రి యుఁడు. కరికాలచోళుని వంశజుఁడు. మానపల్లి రామకృష్ణకవిగా రీకవిని అళియరామరాజు పెద్దతల్లి కుమారుఁడనిరి. ఇందులకుఁ దగిన యుపపత్తులు వారు చూపలేదు. ఈవిశ్వాసమున కనుకూల ములగు నాధారములు సైతము లభింపలేదు. చెలికాని లచ్చారావు గారు కాలనిర్ణయమునఁ బాల్గొని కవి దాక్షిణాత్యుఁడు గావచ్చు ననిరి. ఇంతవర కీతని నివాసస్థలము నిర్ణీతము కాలేదు.

రామకృష్ణకవిగారు భైరవుని శ్రీరంగమాహాత్మ్యపీఠికలో వరద రాజకవిత "మనోహరమైనదనియు మృదుపదవిన్యాసమై వైదర్భి రీతితో నెలకొన్నదనియు, సుకుమారపదబంధముతో సమతల వాహినియగు కావేరివలె ధారాశుద్ధిగలదనియుఁ బ్రశంసించిరి. అంతతోఁ బోక వరదరాజకవితాభాగము శ్రీరంగమాహాత్మ్యము నుండి కొంతభాగ ముదాహరించి క్రిందనిట్లువ్రాసినారు. "పై భాగము చదివినవారెల్లరు వరదుని కవిత భావప్రౌఢికలదనియు భైరవుని కవనముకంటె మిగులునని తలతురుగాని యది కొన్నిచోట్ల చేఁపలబుట్ట యల్లినట్లు నీరసపదభావభూయిష్ఠమై గుచిగొలుపదు" అని వ్రాసిరి. వ్రతానాముత్తమంవ్రతమ్ అన్నట్లు భైరవుని ప్రశం సింపఁబోయి అతని గ్రంథము మేలుతరమని నిర్ణయింపఁబోయి ఇట్లు వ్రాసియుందురుగాని వారనుకొనునట్లు వరదరాజు కవిత త్రోసివేయఁదగినది కాదు. పైపెచ్చు ఉత్తమాంధ్రకవితలోఁ బరిగణింపఁదగినదని మాతలంపు.

వరదరాజు కవిస్తుతిలో శ్రీనాథుని పెద్దిరాజును (అల్లసాని పెద్దన్నను) చేర్కొనుటచేఁ బదియాఱవ శతాబ్దమున కీవలవాఁడని స్థూలదృష్టితోఁ బరిగణింపవచ్చును. కాని యీతనికి అళియ రామరాజువంశమునకు సంబంధమేమేనిఁ గలదా? రామరాజునకీకవి పెద్దతల్లికుమారుఁడెటులగునని ఆరవీటివంశజులకు సంబంధించినచో నెందేని చెప్పఁబడ్డదా యని గ్రంథపరిశోధనము చేయుతఱి వరదరాజుకాలము నిర్ణయించుటకుఁ దృప్తికరమగు నొక యాధా రము లభించినది. దానివలన అళియరామరాజు మనుమని కాలములో కట్టా వరదరాజు ఉండియుండునని విశ్వసింప నవకాశము లభించి నది. అళియరామరాజు కుమారుఁడు శ్రీరంగరాజు. ఇతని కొమారుఁడు చినవెంకటరాజు. ఈచినవెంకటరాజు వరదరాజుకవి సమకాలికులు. ఏలయన చిన్నవెంకటరాజు కుమారుఁడు వేంకట రాజు. ఈవేంకటరాజు-కట్టా వరదరాజకవి కుమారుఁడగు అప్పల రాజు వియ్యంకులు. అప్పలరాజు కుమార్తె తిరువేంగళాంబను వేంకటరాజు కుమారుఁడగు కోదండరామరాజు పరిణయమైనాఁడు. కోదండరామరాజునకుఁ గల యేడుగురు భార్యలలో తిరువెంగ ళాంబ చిన్నది. వివరములు రామరాజీయమునఁ జూడవచ్చును.

"సీ. కావేరి కాల్వలుగాఁ దీర్చికట్టించి
కట్టి నాతని పేరు గలిగి తనదు
కులముప్పఁజేసిన జలజాప్తవంశజుఁ
డగు చోళభూపాలు నన్వయాబ్ధి
సోముఁడౌ వరదరాట్ క్షోణీశునప్పల
మానవాధీశు కుమారికఁ దిరు
వెంగళాంబను నారవీటి వంశలలాముఁ
డౌ రాయలాధీశు నగ్రతనయుఁ
డఖిలరాజన్య మస్తకన్యస్తమకుట
మాన్య మణిరాజ పాదతామరసుఁ డలఘు
చరితుఁడైనట్టి రామరాజ్జనవిభుండు
పరిణయంబయ్యె బాంధవ ప్రణుతులెసఁగ"

గస్టివు అపర్టు (Gustav Oppert) అను వారు రామరాజీయ పీఠికలో వ్రాసిన చరిత్రనిర్ణయము చాల సందిగ్ధముగానున్నది. శ్రీకృ ష్ణదేవరాయల అల్లుఁడగు అళియరామరాజు కుమారుఁడు శ్రీరంగ రాజు. అతనికుమారుఁడు చిన్నవెంకటరాజు. చిన్నవెంకటరాజు కుమారుఁడు వెంకటరాజు. ఈవెంకటరాజుకొడుకు కోదండరామ రాజు. ఈకోదండరామరాజు కట్టా వరదరాజకవి పుత్రుఁడగు అప్పల రాజునకు అల్లుఁడు. కాన అప్పలరాజు కోదండరామరాజు తండ్రి యగు వెంకటరాజునకు సమవయస్కుఁడు. వెంకటరాజు తండ్రి యగు చిన్నవెంకటరాజు అప్పలరాజు తండ్రియగు కట్టా వరదరాజ కవి సమకాలికులు. అందుచేఁ గట్టా వరదరాజకవి అళియరాము

# వ్యాఖ్యానములు

"మళ్లీ శ్రీనివాస అయ్యంగారా ?

శ్రీమాన్ ఎస్. శ్రీనివాస అయ్యంగారు, ఒకప్పుడు, గతి మని కాంగ్రెస్సులో ప్రవేశించారు. అతిదురితంగా వీరాంగం తొక్కి— కృష్ణాష్టమి సంబరంలో, గొల్లబాయికు వొక్క—గంతులోనే వుట్టి కొట్టేటట్టు కాంగ్రెస్సు సింహాసనం ఆక్రమించారు.

అప్పుడు, అక్కడ—అస్సాము పరగణా ప్రకృతిలోనూ, ఇక్కడ మద్రాసు రాజకీయాలలోనూ గొప్ప తుపాను చెలరేగింది.

తీరా అది చల్లబడ్డ తరవాత—అయ్యంగా రేరీ ?

పరకాయించి చూడగా, అయ్యంగారు, హైకోర్టు వకీల్సు చేంబరులో సుఖాసీనులై వున్నారు.

గతక్షణందాకా వారి స్థితి అలాగే వుండింది.

కాని, యిప్పుడు, వారు మళ్లీ కాంగ్రెస్సులో ప్రవేశిస్తున్నారు.

వారు కోరి సొంతంగా ప్రవేశించే టట్టయితే మేము అర్థం చేసుకోగలము ; కాని రాజాజీవగైరాలు, వారిని, అతిమాలి కాంగ్రెస్సులో ప్రవేశపెడుతున్నారు.

ఎందుకూ ?

మా ప్రశ్న కొందరి కిప్పుడు వికటంగానే కనపడవచ్చును ; కాని తొందరపడవద్దు. కాంగ్రెస్సులో శ్రీనివాస అయ్యంగారి పునఃప్రవేశంతో మన ఆంధ్రులకు తల దిమ్మెక్కే దెబ్బ తగులుతుంది.

చూస్తూ వుండండి "

ఇది ౧౯౩౮ జనవరి నెల ప్రబుద్ధాంధ్ర వ్యాఖ్యానం.

మే మప్పు డిలా రాసివుండినందుకు, ఇప్పుడు గర్వించవలసిన పరిస్థితులే సంభవించినందుకు చాలా సంతోషిస్తున్నాము.

అయితే, యిప్పు డొక్క సవరణ మాత్రం వుంది. వారిని అప్పుడు రమ్మన్నవారు రాజాజీ వగైరాలు. ఇప్పుడు రమ్మంటున్నవారు మరొకటి వగైరాలు.

మనం యిక్కడ గమనించవలసిన దేమి టంటే ? ఈకొత్త జట్టులో ఆంధ్రప్రముఖులున్నూ వుండడం.

రాజాజీని పిలుచుకు వచ్చింది కూడా ఆంధ్రులే కనక యిందులో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు.

రాజాజీ మద్రాసు అసెంబ్లీలో అడుగు పెట్టారు. ప్రకాశంగారి నాయకత్వం పడిపోయింది. వెనకటి సంగతి అలా వుండగా, శ్రీనివాస అయ్యంగారు ఇప్పుడు మళ్లీ మద్రాసు రాజకీయాల్లో అడుగు పెట్టారు. పట్టాభిగారి కాంగ్రెస్సు అధ్యక్షత యెగిరిపోయింది.

బాగానే వుంది.

మేము చాలా సంతోషిస్తున్నాము.

అయ్యంగారికి మనస్ఫూర్తిగా స్వాగతమున్నూ చెబుతున్నాము.

ఔరంగజేబు పాదుషా ప్రభుత్వం మహారాష్ట్ర సామ్రాజ్యానికి కారణం అయింది. కర్జను ప్రభువు రేపల్లడి మన భారతీయుల నిద్ర మత్తు వదలగొట్టింది.

అదే యిప్పుడున్నూ సూత్రం.

రాజగోపాలాచారిగారి ప్రభుత్వం మన ఆంధ్రుల కళ్లు నుసకలు పోగొట్టింది. శ్రీనివాసఅయ్యంగారి రాక మనకి పూర్తిగా ఆత్మజ్ఞానం కలిగిస్తుంది.

ఆంధ్రరాష్ట్ర సాధనా ప్రణాళికకు యివి రెండూ అగత్యమైనవే.

---

రాజు మనుమఁడగు చిన్న వెంకటరాజు కాలము వాఁడు. అళియరామరాజు తల్లికోట సంగ్రామమున క్రీ. శ. ౧౫౬౫ లోఁ దొంబదియేండ్ల వృద్ధుఁడుగానుండి సంగరమున మరణించెను. అయన కుమారులలోఁ గడఁగొట్టువాఁడగు శ్రీరంగరాయలు అప్పటికి యుక్తవయస్సులో నున్న వాఁడె. శ్రీరంగరాయలకుమారుఁడు చిన్న వెంకటరాజు కట్టా వరదరాజు సమకాలికులుగ బుజువగుటచే నీయిరువురు క్రీ.శ. ౧౬౦౦ లో నుందురు. ఇందుచే స్థూలదృష్టిచేఁ గట్టా వరదరాజకవి క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమున జీవించియుండెననియు విద్యానగర ప్రాంత వాసియనియు గ్రహింపవచ్చును.

రామరాజీయము అళియరామరాజునకు అయిదవతరము వాఁడగు కోదండరామరాజున కంకితము. ఈ కోదండరామరాజును గవిసరపతి విజయమను రామరాజీయమునందు రామరాజు అని కవి పేర్కొని నాఁడు. అతఁడు పోచిరాజు కృష్ణభూపతికి అల్లుఁడు. ఈ సందర్భములు పరిశీలింపక ఈ కోదండరామరాజె తల్లికోటయుద్ధములో మరణించిన రామరాజనియు నందుచే నతనికుమారుల పేర్కొనుటతో రామరాజీయము అసంపూర్ణముగా ముగింపఁబడినదియు రామరాజీయ ప్రకాశకులగు Gustav Oppert గారు తలంచినారు. రామరాజీయమున కోదండరామరాజు వృత్తాంతము పూర్తిగాఁ గలదు. ఆతనిభార్యలు పుత్రులు ప్రశంసింపఁబడిరి. అశ్వాసాంత పద్యములతో గ్రంథము ముగిసియుండును గాని గ్రంథసమాప్తి చెలువుభాగము నశించినది. కోదండరామరాజు లాసనము అనుపట్టణము కడ మైసూరివారితో సంగరమునఁ బాల్గొనెను. అందు కొసగకోట తిమ్మయ, సబినీసుకృష్ణయ్య మట్టి వెంకటపతి పాల్గొనినారు. అళియరామరాజు తల్లికోట సంగరమున వీరమరణము నొందినవాఁడు గాన నీ యిరువురు భిన్నులు.

అళియరామరాజు మనుమఁడగు చిన్న వెంకటరాజు కాలమె కట్టా వరదరాజు జీవితకాలము. ఇంతవరకుఁ గాలనిర్ణయమునకు వీలు కానరాకున్న కట్టా వరదరాజ కవి స్థూలదృష్టితో క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమువాఁడని విశ్వసింప వీలుచిక్కినది. కట్టా వరదరాజకవి గ్రంథములలో రామాయణద్విపదరసవత్తరమగు కృతి. రంగనాథ రామాయణమున కంటె రెండు రెట్లు పెద్దది. ఈ యుత్తమగ్రంథము ప్రచురింప నెంచు మా ప్రయత్నము సఫలమగునేని ఆంధ్రలోకమునకుఁ ద్వరలో నర్పింతుము.

## మనల్ని అణచివేసే ప్రతికూల శక్తులు

కొంత భాగం మొన్న మొన్ననే వోఢ్రులు కొట్టుకుపోయినా, సగానికి పైగా నైజాముగారి పంజాలో యిరుక్కుపోయి వుండినా, రెండుమూడు జిల్లాల ప్రదేశం మైసూరి వొడయర్ల కాలికింద కూడా అణగారి పోయి వుండినా, అటు సీ. పీ. లోనున్నూ కొంత ప్రదేశం జీర్ణావస్థలో వుండిపోయినా, మద్రాసు ప్రెసిడెన్సీలో, యిప్పటికీ బ్రిటిషువారి చేతిలో వున్న ఆంధ్రదేశం చిన్నది కాదు.

ఆంధ్రజనసంఖ్యకూడా పరిమితం కాదు.

ఆదాయం సైతం లిగాడుగా లేదు.

సహజసంపదకిన్నీ యెంతమాత్రమూ లోటులేదు.

కాగా, మన ఆంధ్రమండలాలకు ప్రత్యేకరాష్ట్రం కావడానికి తగిన యోగ్యత లేకపోలేదు.

బ్రిటిషువారికి, మన రాష్ట్రవాంఛను తిరస్కరించడానికి కారణాలేమీ లేవు.

సమయం కనిపెట్టి, సరియైన ప్రణాళిక పన్నుకుని, తెలివితేటలుగా పనిచేస్తే, వారు, ఆంధ్రరాష్ట్రం తప్పకుండా నిర్మిస్తారు.

ఇది యిలా కాదేమో అని సందేహించడానికి ప్రస్తుతం హేతువు లేమీ లేవు.

ఆంధ్రరాష్ట్రం కోసం మనలో కొందరు జెయిలుకి వెళ్లవలసిన పరిస్థితులు సంభవించనే సంభవించవు.

పైగా బ్రిటిషువారు ఆంధ్రరాష్ట్రవాంఛకి మొదణ్ణుంచీ సుముఖులే అయి వున్నారు.

ఈవిషయంలో మనల్ని ప్రతిఘటించి అణచివేసే ప్రతికూలశక్తులు వేరే వున్నాయి.

వాటిలో వొకటి వోఢ్రులది.

మన దేశం వారూ, వారి దేశం మనమూ పర్యాయతీగా ఆక్రమించుకుంటూ వుండే. ఆచారం చారిత్రకమే.

ప్రస్తుతం వారు మనదేశం కొంత ఆక్రమించుకుని వున్నారు.

బ్రిటిషు ప్రభుత్వం అమల్లో వుండి, అంతర్యుద్ధాలకు అవకాశం లేని యీకాలంలో యిది యిలా జరిగిపోవడం చాలా హాస్యాస్పదమైన సంగతి.

దీనికి కారణం వుత్తరాదివారి ద్రోహం కొంత. మన చేతకానితనం కొంత.

గతం యేమయినా, యిప్పుడు ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరిగిందంటే వొరిస్సాలో చేరిపోయి వున్న ఆంధ్రభూభాగం మళ్ళీ మనకి సంక్రమించకతప్పదు.

అది స్వాధీనపరుచుకోలేకపోతే మనకి రాష్ట్రం వచ్చినా వొకటే రాకపోయినా వొకటే.

ఇది వోఢ్రులకు తెలుసు. కనక, వారు, ఆంధ్రభూభాగం తమ చేతిలోనుంచి జారిపోకుండా వుండేటట్టే కాదు, ఆంధ్రరాష్ట్రం యేర్పాటు కాకుండా వుండేటట్టే వుచ్చులు పన్నుతారు.

రెండోది మహారాష్ట్రులది.

సీ. పీ. లో గాంధిగారు, ఖరేగారిని చిత్తుచెయ్యడంలో మన ఆంధ్రులకూ మహారాష్ట్రులకూ విరోధబీజం కూడా నాటారు.

వర్కింగుకమిటీ సమావేశంలో మన పట్టాభిగారిచేతనే ఆ ప్రస్తావం ప్రతిపాదింపజెయ్యడంలో గాంధిగారి కింతకంటె మరో వుద్దేశం లేదు.

అది ప్రయత్నపూర్వకంగా జరిగిందే; కాని యాదాలాభంగా తటస్థించింది కానేకాదు.

ఇది మహారాష్ట్రులు మరిచిపోలేదు.

అర్థం చేసుకోగలిగే వారికి వారి పగ స్పష్టపడే వుంది. తక్కిన వారికి కొద్దిరోజుల్లో నే బోధపడుతుంది.

మాంచి రసకందాయప్పట్టులో, అది, మనల్ని వొక వూపు వూపి మరీ విడిచిపెడుతుంది.

మూడోది బంగాళీలది.

ఇందులో, మేము వ్యాఖ్యానం చేసి బోధపరచవలసిందేమీ లేదు.

బోసుగారే వోడిపోయి, మన పట్టాభిగారే నెగ్గగలిగినా యిది మనకి తప్పనిదే.

పట్టాభిగారు స్వబుద్ధితో యీపోటీ చేసి వుంటే బంగాళీల ద్వేషం స్వార్థకారణంగా యేర్పడ్డ దనడానికి వీలుండేది.

మన పట్టాభిగారు గాంధిగారి కోసం యీవూబిలో దిగబడ్డారు.

గాంధిగారు ఇందుకు మరొకరు దొరక్కపోవడంవల్లనే పట్టాభిగారిని చేరదీశారు.

చివరికిది జాతిపరం అయిపోయింది.

తమిళులు బెంగాళీలకు పక్కతాళం వేశారు.

మన ఆంధ్రులలో అనేకులమీద బంగాళీపత్రికలు పేర్లు పెట్టి నిప్పులు కక్కాయి.

పటేలుగారి బోధనలవల్ల బోసుగారు, యిదివరకే ఆంధ్రరాష్ట్రానికి వైముఖ్యం చూపించారు.

అప్పుడది స్వయంభువు కాదు; గాని యిప్పుడు ముదిరి ముసుళ్ల పండుగ అవుతుంది.

త్రిపురీకాంగ్రెస్సు, సూరత్ కాంగ్రెస్సు అవతారం ధరించకుండా వుండి, సంవత్సరం దాకా బోసుగారి నాయకత్వం చెలామణీ కావడమే సంభవిస్తే, అది, మన వుద్యమానికి యెదురొమ్ముమీది కుంపటి కాక తప్పదు.

నాలుగోది గుజరాతీలది.

వారిలో గాంధిపటేలుగార్లు ముఖ్యులు.

బోసుగారిమీదికి కవ్వించి, పట్టాభిగారిని మొన్న ఆకాశాని కెత్తివేసిన పటేలుగారు, రాష్ట్రోద్యమానికి సంబంధించిన రాయబారాలను—పట్టాభిగారిని కూడా ఘాటుగా హేళన చేసివుండడం ఉన్మాదావస్థలో వున్నవారు తప్ప మరెవరూ మరిచిపోరు.

గాంధిగారి బంధుప్రీతి కూడా యింగితజ్ఞానం కలవారెవరూ మరిచిపోరు.

ఇంతకీ.

ఇప్పుడు కాదు. ఈసంగతులు ప్రత్యక్షంగా తెలిసే రోజులు ముందున్నాయి.

అయిదోది అరవలది.

తక్కినవి తాత్కాలికాలు. అరవలది సార్వకాలికం.

అవి యేకముఖాలు. ఇది సర్వతోముఖం.

తక్కినవారికి, తమ ప్రాతికూల్యం విడిచిపెట్టుకుంటే—అథవా తాము తటస్థంగావుంటే నష్టం లేదు. అరవలకు నష్టం వుంది.

భరతఖండం విడిచిపెట్టడానికి ఆంగ్లేయుల కెలా వీలు లేదో, ఆంధ్రమండలాలు విడిచిపెట్టడానికి అలాగేఅరవలకున్నూ వీలులేదు.

పైపై చూపులకు ఇంత మెత్తనిదీ లేదు. లోలోపలి పరిశీలనకు ఇంత తీక్ష్ణమైనదీ లేదు.

దీనికి సాయం,

మద్రాసుప్రభుత్వంలో యేడిపార్టుమెంటు చూసినా వుద్యోగాలన్నీ వారి చేతిలో వున్నవి.

ఇండియాగవర్నమెంటులో కూడా వారికి వుద్యోగప్రాతినిధ్యం అధికంగానే వుంది.

ఇంతే కాదు,

అరవలలో బలమైన కాంగ్రెస్సుపక్షం వున్నది. బలమైన జస్టిస్సుపక్షం వున్నది. బలమైన లిబరల్ పక్షం వున్నది.

ఈపక్షాలకు అతీతులైనవారిలో కూడా ప్రముఖులు వందలకొద్దీ వున్నారు.

ఇలాగ ఏపక్షంలో చూసినా వారి పలుకుబడి అసాధారణంగా వుండడమే కాదు, బరోడాదివాను అరవమహాశయుడు. కొచ్చిన్ దివాను అరవమహాశయుడు. తిరువాన్కూరు దివాను అరవ మహాశయుడు. హైదరాబాదు కర్ణధారి అరవమహాశయుడు.

దీనివల్ల, ఫెడరల్ అసెంబ్లీలో, యీసంస్థానాల ప్రాతినిధ్యం అరవల ప్రాతినిధ్యంగానే పరిణమించి వూరుకుంటుంది.

మొన్నటిదాకా అరవలు మన నాయకరాజుల పాలితులై వుండినారు. దాని కిప్పుడు బదులు తీర్చుకోవాలనే పట్టుదల వారికి ఉండినే వచ్చు.

అన్నిటికీ మూలం.

ఇప్పుడు మద్రాసుశాసనసభల నాయకత్వం అయాచితంగా అరవలకు తక్కింది.

ఆంధ్రులలో కొందరి ద్రోహంవల్లనే అది అలా జరిగింది.

ఇప్పటికే మన ఆంధ్రమండలాల పాలిటి కది కాళరాత్రిగా వుండింది.

ఇప్పుడే మనం దాన్ని ప్రతిఘటించలేకుండా వున్నాం.

ఇటీవల, గుంటూరు విశాఖపట్నాలలో ప్రధానికీ, విశాఖపట్నంలో ఆరోగ్యశాఖామంత్రికీ జరిగిన ఆదరసత్కారాలు దారుణమైన శలలు వెయ్యకుండా వుండవు.

ఇలాగ, ఎటు చూసినా యిది సాలీడు గూడుగా కనపడుతున్నది.

ఉండుండి యెప్పుడో వొకప్పుడిది విశ్వరూపం తాల్చకుండా వుండదు.

అప్పుడు తక్కినవారంతా మనమీద తలో రాయీ వెయ్యకుండా విడిచిపెట్టరు.

ఈసంగతు లేమీ గమనించకుండా, ఎవరో భావదాస్యంలో మగ్గిపోతున్నవా "రదిగో ఆంధ్రరాష్ట్రం" అంటే మనం మురిసిపోవలసిం దేనా ?

ఈప్రతికూలబాహుళ్యం యిగిరిపోయేటట్టు చెయ్యగల పట్టుదల మన జాతిలోనూ, ఇదంతా పరిగణించకుండా ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి పూనుకునేటట్టు బ్రిటిషువారిని ప్రేరేపించగల నిర్వహణ చాతుర్యం మన ప్రముఖుల్లోనూ వున్నదా ?

గాంధిగారి సిద్ధాంతమూ, కార్యక్రమమూ మంచి వంటామూ, వాటికోసం హుజూరునుంచి రాజగోపాలాచారిగారు రావలసి వచ్చింది.

సుభాసుబోసుగారి సిద్ధాంతమూ, కార్యక్రమమూ మంచి వంటామూ, వాటికోసం శ్రీనివాసఅయ్యంగారికి ఆహ్వానం వచ్చింది.

మన ప్రముఖుల సత్తా యేపాటిదో యివి వెల్లడించడం లేదూ ?

ఈస్థితిలో, యింతట్లో, యింకెక్కడి ఆంధ్రరాష్ట్రం ?

## అహమ్మదాబాదు = మాంచెష్టరు

"పతాకోత్సవము జరిపిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఉపన్యాసమున మిగిలినవారి ఉపన్యాసములందున్న ఉన్మాదము లేనప్పటికీ వారి ఉపన్యాసములోని కొన్ని అంశములు అంత పరిహాసాస్పదముగా యున్నవి. ఆంధ్రులకు మాంచెష్టరు ఎంత పరాయి దేశమో గుజరాతు కూడా అంత పరాయి. దేశమే వట. ప్రపంచజ్ఞానమున్నవారెవరూ ఈవాదనకు సమాధాన మివ్వ ప్రయత్నింపరు. వారి ఉపన్యాసము వారికి ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమున గల ఉద్రేకమును తెలియజేయవచ్చును. కాని ఏసందర్భమున కూడ ఆ ఉత్సాహోద్రేకములు పరిమితి దాటినపుడు ఉన్మాదము క్రింద మారక తప్పదు. ఆంధ్రరాష్ట్ర మన్న ఎంత గాఢాభిమాన మున్నవారును యీ పోకడలను హర్షింపజాలరు"

దైనికాంధ్రపత్రిక ౧—౩—౫౪

నావుపన్యాసానికి నే నాశించిన ఫలితం అందరూ ఆమోదించి ఆచరించడం కాని, పూని సమాధానం యివ్వడం కాదు.

అయినా, ఆంధ్రపత్రికాసంపాదకులు పూనుకున్నారు.

చాలా సంతోషం.

ప్రపంచజ్ఞానసంపన్నులు మరికొందరున్నా అందుకు పూనుకో వలసిన అగత్యం మరి లేదు.

నా పత్రికోపన్యాసంలో నేను చెప్పిన మాట లివీ.

"మన బజారంతా యిప్పుడు బొంబాయి అహమ్మదాబాదు బట్టల మిల్లుల సరుకుతో నిండిపోయి వున్నది. ఆబట్టలు మనకి స్వదేశీలో చేరతాయా? అవే చేరితే మాంచెస్టరు బట్ట లెందుకు చేరవూ?"

ఈమాటలు తెస్సగా బోధపడడానికి నే నీ వుదాహరణ యిచ్చాను.

"అరవలు మన్న డబ్బుతో మెట్టూరు పైకారా ప్రాజెక్టులు నిర్మించుకున్నారు. అవి మన రాయలసీమకి వుపయోగించాయా?"

ఆంధ్రపత్రిక వ్యాఖ్యానం చూశాక కూడా నామాటల్లో నాకేమీ తప్పు కనపడ్డం లేదు.

ఏమంటే?

ఏదేశంలో మూడుగుడ్డలు దొరకవో—అవి తయారు చేసుకోడాని కవకాశా లుండవో అది యెడారి కూడా కావు, వల్లకాడు.

ఏవస్తువుల విషయంలో నయినా స్వదేశీవ్రతం పట్టవలసి వుంటే అవి మూడుగుడ్డలే. తతిమ్మా వస్తువులు వాటి తరవాతే లెక్కలోకి వస్తాయి.

గాంధిగారి కద్దరుద్యమంలో ధర్మం వున్నదా? ఉంటే అదీ మనం గుజరాతీబట్టలు కట్టుకోడం అంగీకరించదు.

రాజగోపాలాచారిగారు మిల్లుబట్ట లమ్మే దుకాణాలమీద పన్ను వెయ్యడం చేతిమగ్గాల రక్షణకే అంటారా, అదిన్నీ మనం గుజరాతీ బట్టలు వాడడానికి సమ్మతించదు.

ఎవ రెన్ని ధర్మాలు చెప్పినా లాభం లేదు, ఎన్ని కట్టుదిట్టాలు చేసినా ప్రయోజనం లేదు. భాష మానవకోటిని విడదీస్తుంది.

మరి దేనివల్లా మళ్లీ కలవడానికి వీలు లేనంత పూర్తిగా విడదీస్తుంది.

ఇంతే కాదు. భాష వొక్కటే మానవకోటిని విడతీస్తుంది.

తెలుగు పనివా డొకడూ, యింగ్లీషుపనివా డొకడూ వెళ్లి పని లో చేర్చుకోమంటే మాంచెస్టరు మిల్లుయజమాని తెనుగుపనివాణ్ణి దూరంగా తరిమేస్తాడు.

గుజరాతీపనివాడూ, తెనుగుపనివాడూ వెళ్లి పని యిమ్మంటే అహమ్మదాబాదు మిల్లు యజమాని తెనుగుపనివాడి, యెడల చూపే దృక్పథం కూడా అక్షరాలా—సర్వాత్మనా యిదే.

ఏం?

ఇది యెందు కిలా జరగాలి?

తన తోటి ఆంధ్రుణ్ణి కూలగొట్టి, అతని పదవి ఆక్రమించుకున్న అరవపెద్దమనిషిని వెనక వేసుకు వచ్చే ఆంధ్రుడి కిది అర్థం కాదు.

కోరి సొంతంగా కొనుక్కొని, మురిసిపోతూ కట్టుకునే బట్టలు కం—కోటలు మగ్గాలలో అపార మైన విజ్ఞానం వున దని భావించే వ్యాఖ్యాతకి, "ఆంధ్రుడికి అహమ్మదాబాదూ, మాంచెస్టరూ వొకటే" అనే మాటలో వున్మాదమే కనపడుతుంది.

ఇక నేను అడిగే దేమి టంటే?

"భారతీయుల వున్మాదం గుజరాతీల కుపయోగించింది. అలాగే ఆంధ్రుల వున్మాదం ఆంధ్రుల కుపయోగపడకపోతుందా? చూద్దాం."

## నిజా మాంధ్రులు ముస్లిము లయిపోవలసిం దేనా?

మతాంతరుల వొత్తిడి యెంత దుర్భరంగా వుంటుందో మన బ్రిటిషాంధ్రులకు తెలవదు. ఉత్తరదేశం వార్తలవల్ల కొంతకొంత అర్థం కావచ్చు; కాని అవి ఆంధ్రులకు సంబంధించినవి కావు.

ఈబాధ మన ఆంధ్రులకున్నా లేకపోలేదు.

అది వొకమాత్రంగా కూడా లేదు.

ఒకడూ యిద్దరూ కాదు, దీనివల్ల డబ్భయి లక్షల ఆంధ్రులు అటమటించిపోతున్నారు.

మన నిజామురాష్ట్రంలోనే యీమారణహోమం జరుగుతున్నది.

అసలు మన మతమే స్వపక్ష పరపక్ష నిరూమధామంగా వుంది. ముస్లిముల మతాభినరతి దీనికి తోడయింది.

ప్రభువు ముస్లిము కావడం—అన్ని విధాలా ముస్లిములకే అక్కడ ప్రాధాన్యం వుండడం—ఇది అగ్రజాతులలో కూడా తల తిప్పేస్తున్నది.

యీబాధ లెక్కడే—తమ మతంలోనే అనుభవిస్తున్న అస్పృశ్యులు ఇస్లాంలో కలిసిపోతున్నా రంటే ఆశ్చర్యం యేమిటి?

దీనిమీద ముస్లిముల ప్రోత్సాహం. ఆహ్వానం. మనవారి నిరసనం. బహిష్కారం.

ఇదివరకే లక్షల అస్పృశ్యులు ముస్లిము లయిపోయారు.

ఈస్థితిలో, తాను, తన జాతివారితో అన్యమతంలో కలిసిపోతానని డాక్టర్ అంబేద్కర్ ప్రకటన.

ఇది నిజాము రాష్ట్రంలోని అస్పృశ్యులలో బాహాట మైన తెగువ కలిగించింది. ముస్లిములలో అతి చురుకు పుట్టించింది.

అంబేత్కరు శిష్యులు కొందరు సికింద్రాబాదులో "అంబేత్కర్ యువజనసంఘం" ప్రారంభించారు.

కొందరు ముస్లిములు అంబేత్కరుకు స్వాగతం యివ్వడానికి వెళ్లారు.

నిజాని కిప్పటికీ అతగాడు అన్యమతంలో చేరలేదు; కాని శిష్యులూ, ఆశ్రితులూ, కులంవారూ ఆలస్యం వోర్చుకో లేకపోయారు.

నవాబ్ యార్జంగుబహద్దరుగారని నిజామురాష్ట్రంలో వొక పెద్ద జాగీర్దారు.

ఆయన మతాభిమాని.

ఆరాష్ట్రంలో వున్న ౨౫ లక్షల అస్పృశ్యులనీ ఇస్లాంలో చేరడానికి ఉన్ముఖులయివున్నట్టు ఆయనకు తోచసాగింది.

వెంటనే ఆయన తన పరివారంతోనూ, అంబేద్కరు యువజన సంఘసభ్యులు కొందరితోనూ బయలుదేరినారు.

ఎక్కడికీ, అని అడగడమూ చెప్పడమూ యెందుకూ?

ఆంధ్రుడికంటే స్వాభిమానదూరుడు మరొకడు లేడుగా?

ఓరుగల్లు, కరీంనగరు, నల్లగొండజిల్లాలలో ఆయన మొదట ప్రచారం సాగించారు. ప్రచారకులలో మస్లిములూ, అస్పృశ్యులూ కూడా వుండినారు.

ఆయన స్వయంగా కూడా గ్రామగ్రామమూ తిరిగారు.

మతదీక్షతో పాటు పురుషులకు నాలుగేసి రూపాయలు—తుర్కీటోపీ—లాగు—చొక్కా, స్త్రీలకు లంగా—రవికె—ఒక్కొక్కరికి ఈవిధంగా బహుమతులు కూడా యిచ్చారు.

ఈదుస్తులు చూసుకుని, యీకొత్తమతం చూసుకుని, మస్లిం ప్రముఖుల అసరా చూసుకుని, మహోజ్వల మైన భవిష్యత్తు కల్పించుకొని అకొత్త మస్లిములు "మీకు నౌకరీ చెయ్యం" అని హిందువులమీద—ఆంధ్రులమీద తిరగబడ్డారు.

ఇది చూసి మనవారు గడగడలాడిపోయారు.

ఓరుగంటి ప్రభువుల సంతతి. సర్దారుల సంతతి. యోధుల సంతతి. గురువుల సంతతి. వర్తకుల సంతతి—అందరూ గుడ్లు తేలవేశారు.

ఇది చూసి ఆర్యసామాజికులు రంగంలో వురికారు.

వారు కష్టసుఖాలు చెప్పారు. మంచిచెడ్డలు బోధించారు. శుద్ధి చేశారు.

యార్జంగు బహద్దరుగారు వెళ్ళిన చోటికల్లా వెళ్ళి ప్రతికూల ప్రచారం చేశారు.

కొంత ఫలం కలిగింది.

కాని అధికారులు ఆర్యసామాజికులనూ, ఆంధ్రులనూ, శుద్ధి పొందిన అస్పృశ్యులనూ బెదిరించారు.

అయినా, ఆర్యులు జంకలేదు. ఆంధ్రులను కూడా వారు జంకనివ్వలేదు. అదిమాంధ్రులకు కూడా వారు ధైర్యం కలిగించారు.

"అయ్యా! మాకు నౌకరీ కావాలి. అది చేసేవారు ఏమతంవారయినా మాకు పేచీ లేదు. మీ మతంలో కలిసిన మా అస్పృశ్యులను మేము పొమ్మనడానికి కారణం వుంది. అదేమి టంటే? మా కళ్ళాలలో పాలితొక్కే ఆచారం వుంది. అది పనివాళ్లే తొక్కాలి. అయితే, జుట్టూ, మొలతాడూ వున్నవాడే కాని ఆపని చెయ్యడానికి వీల్లేదు. ఈకొత్త మస్లిములకు అవి లేవుగా? మరి మే మేం చెయ్యగలం?" అని ఆంధ్రులు జవాబు చెప్పారు.

కథ అడ్డం తిరిగింది. కొత్త మస్లిములు శుద్ధి చేయించుకోక తప్పింది కాదు.

అయితే అంతా చేయించుకోలేదు. కొందరు మిగిలారు.

అసాధరణాలయాల్లో ఇస్లాం మతంలో చేరక తప్పదు. జెయిళ్లలో కూడా ఇది సర్వసాధారణమే. కొందర్ని నౌకరీ లిచ్చినన్ని అమతంలో నిలబెట్టగలరు.

ఇంతే కాదు.

మస్లిములు మాలమాదిగ స్త్రీలను నికా కట్టుకుంటారు.

ఇక్కడ వొక్క సంగతి.

హైదరాబాదులో వొక గొల్లదాని కొక కూతురు. తల్లికి సుస్తీగా వుండగా వొకనాడు పాలు పొయ్యడానికి కూతురు వెళ్లింది. ఒక దేవిడీలో నుంచి వస్తూవుంటే వొక మస్లింనౌకరు పట్టుకుని దాన్ని చెరిచినాడు. గోల అయింది. రగడ జరుగుతుండగా దాని మొగుడు "ఇక నువ్వు నాకక్కర్లే" దని చెప్పాడు. అది చూసి వొక మౌల్వీ "చూశావా? నీకు కాపరం లేకుండా చేసుకుంటావా? నిన్నెవరు చెరిచారంటున్నావో అతను నిన్ను నికా చేసుకుంటాడు. మా మతంలోకి రా" అని పిలిచాడు.

చివరికి అలాగే జరిగింది.

ఇది యిలా వుండగా:

ప్రభుత్వంవారి మతశాఖలో పనిచేసేవారంతా—జవానులతో కూడా అందరూ మస్లిములే.

ఆశాఖద్వారా కూడా మనవారికి నేక చిక్కులు కలుగుతున్నవి.

నిజాము ప్రభుత్వం లండన్‌లో మసీదు కట్టడానికి అయిదు లక్షల రూపాయల విరాళం యిచ్చింది. భరతఖండం మొత్తంమీద అనేక మసీదులకూ, దర్గాలకూ, గోరీలకూ విరాళం యిచ్చింది. మక్కా నుంచి మదీనాకు ఎడారిలో రోడ్డు వేయించడానికి—పూర్తిగా సొంతంగానే వేయించడానికి పూనుకున్నది. హాజీయాత్రకు వెళ్లే వారికి స్పెషల్ రయిలు ఏర్పాటుచేస్తుంది. వారిలో సర్కారు నౌకరీలో వుండేవారికి జీతం యిస్తూ ఆరేసి నెలలు సెలవుకూడా యిస్తున్నది. ఇంచుమించు ప్రతీ కచేరీ పక్కనూ మసీదు నిర్మాణం జరుగుతున్నది. రాష్ట్రం అంతటా మసీదులు వెలుస్తున్నవి. ప్రతీ దినమూ వొంటిగంటవేళ నమాజుకోసం తురక అధికారుల కందరికీ సెలవు. రంజానులో నెలరోజులు పొద్దున్నే కచేరీలు. ఆనెలలో హిందూ హోటళ్లవారూ, హిందూ కాఫీహోటళ్లవారూ వీధిగుమ్మాలకు తప్పకుండా పర్దా కట్టుకోవాలి. ఏమంటే? లోపల ఫలహారం చేస్తున్న హిందువులు వీధిని పోయే మస్లిములకు కనపడగూడదు.

సెలవు లేనిదే హిందువులు దేవాలయాలు కట్టుకోగూడదు. పాతవి మరామత్తు కూడా చేయించుకోగూడదు. ఆసెలవు పుట్టనే పుట్టదు. నాలుగు గోడలమధ్యా కూచుని సత్యనారాయణవ్రతం చేసుకోవాలన్నా అధికారుల సెలవు పొందాలి. సాధారణంగా సెలవు పుట్టదు.

హిందువులు ఎలాంటి వూరేగింపులు చేసుకోవాలన్నా సెలవు కావాలి. ఆసెలవు పుట్టదు. మస్లిములకు సెలవే అక్కర్లేదు.

ఉస్మానియా కాలేజీలో కూడా మస్లిం విద్యార్థుల కోసం మసీదు కట్టించింది ప్రభుత్వం. హిందువులకు దేవాలయం లేదు. ౧వ ఫారం మొదలు బి. ఏ. దాకా తురకవిద్యార్థులకు కురాను,

ఇస్లాంమతబోధా ప్రతీదినమూ చేస్తారు. హిందూవిద్యార్థుల కేమీ లేదు.

మతోత్సవాలకు సంబంధించిన వూరేగింపులు నడిపినందుకు ఇప్పుడు మనవారిలో అనేకులమీద కేసులు ఉన్నవి. అవి వ్యతిరేకం అయితే మన ఆంధ్రులలో స్వమతాభిమానం చూపించినందు కనేకులు రెండేసి—మూడేసి నెలల కైదు శిక్ష అనుభవించవలసి వుంటుంది.

ఇవి, అక్కడ జరుగుతున్న వాటిలో లక్షలలోవున్నా లెక్కకావు.

ఏమిటి యీ ఔద్ధత్యం.

దీనికి పారం లేదూ ?

ఇక్కడ మన్నం గమనించవలసిం దేమి టంటే ?

ఇలాంటి బాధలు నిజాము రాష్ట్రంలో మహారాష్ట్రులకూ వున్నవి; కాని వారికి యిన్ని వుండవు. ఇంత క్రూరంగా వుండవు.

వారు ధైర్యంగా యెదురుకుంటూరు. బ్రిటిషుమహారాష్ట్రుల సాయం వారికి అలాంటి ధైర్యం కలిగిస్తున్నది.

అసలు మనవారికి మతాభినిరతే తక్కువ. ఉండినా ఐకమత్యం లేదు. తన్మూలంగా ధైర్యం శూన్యం. అపైని వారికి మన బ్రిటిషాంధ్రుల తోడ్పాటు లేదు.

ఖిలాపత్తుకోసం దెబ్బలు తిన్న—జెయిళ్ళకు వెళ్ళిన—మన కాంగ్రెస్సాంధ్రులలో వొక్కరికీ యీసంగతులు తెలవవు. తెలితే, వీటిని వారు "స్వల్పవిషయాల" కింద కట్టేసి, చీనా వారికి సాయంచెయ్యడానికీ, స్పెయిన్ వారికి సానుభూతి తెలపడానికి వెళ్ళిపోతారు.

ఇంతకీ :

ఆర్యసామాజికుల సాయం వస్తే గాని మన నిజామాంధ్రులు నోరెత్తలేకపోవడం యేమిటీ ?

ఆర్యసామాజికులు ప్రాయశః ఆంధ్రేతర్లు. వారిలో ఆంధ్రులు కూడా కొంద రుండినా ప్రముఖు లయి వుండరు.

సహజమైన ధైర్యసాహసాలూ, మతాభినిరతీ లేకపోవడం చూసి ఆర్యసామాజికులు కూడా వొకప్పుడు మనవారిని లోకువ చెయ్యవచ్చు.

ఇది మనకి శ్రేయస్కరమా ?

ఈమతాంతరప్రవేశంవల్లనే అక్కడి మన ఆంధ్రజాతి దినదినమూ తగ్గిపోతున్నది. దుర్బల మయిపోతున్నది. హాస్యాస్పదం అయిపోతున్నది.

దీనికి ప్రతిక్రియ లేదూ ?

ఇది గమనించలేని మనం మరేమి సాధించగలమూ ?

## మూడో బడ్జెటు

మద్రాసు కాంగ్రెస్సు ప్రభుత్వం మూడో బడ్జెటు ప్రతిపాదించి నెగ్గించుకున్నది.

కాంగ్రెస్సువా రంతా దాన్ని మెచ్చుకున్నారు. చెట్టినాడు కుమారరాజా, సర్. మహమ్మదు ఉస్మాన్‌ల వంటి ప్రతికూలురు కూడా దాన్ని మెచ్చుకున్నారు.

ఒక్క మన సర్. రెడ్డినాయుడు గారు మాత్రమే దాన్ని చక్కగా విమర్శించి, ప్రతిపద్దూ సావధానంగా ఖండించి, తీవ్రంగా నిరసించారు.

కాంగ్రెస్సాంధ్రు లయి వుండీన్నీ వొక్క లక్కరాజు సుబ్బారావు గారు మాత్రమే దాన్ని నిరసించబోయారు.

మన మంత్రులు, ఒక్క గాంధిగారిని సంతోషపెట్టడానికి క్రమాంతరాలమీద నికర మైన ఆదాయం వదులుకున్నారు. ఇంకా వదులుకోదలిచారు.

ఆలోటు పూడ్చుకోడానికి, ప్రజలకు పీడాకరా లయిన కొత్త పన్నులు వేశారు. చిన్న రేవుల నిధి ౪౦ లక్షల పైచిలుకు కాజేశారు.

ఇంత చేస్తేగాని ఆయవ్యయాలు సరిపుచ్చుకోలేని మంత్రులను సమర్థించడం అంటే యేమిటో వోటర్లు ఆలోచించాలి.

౧౫౦ లక్షలు అప్పు కూడా చేశారు.

అర్థికవేత్తలు వాయిదాల ప్రకారం అప్పులు తీర్చడానికి చూస్తారు. కాంగ్రెస్సు మంత్రులు అప్పుచెయ్యడమే వాయిదాల ప్రకారం జరుపుతున్నారు.

ఇది మూడో అప్పు. ఇప్పటికి వీరు చేసిన అప్పు నాలుగున్నర కోట్లకు మించింది. తక్కిన రెండు సంవత్సరాలూ కాంగ్రెస్సు పరిపాలనం తప్పకపోతే—ఈరేటున చూసుకున్నా మనకి ఏడున్నర కోట్ల అప్పు తప్పదు.

మరి చేసిన ఘనకార్యాలు ?

హిందీని నిర్బంధం చెయ్యడం. ఊరూరా రాటపు జెండా లెత్తడం.

ఈసంవత్సరం బడ్జెటు ఆంధ్రులకు నిర్ధూమధామంగా వున్నది.

ఇందుకోసం మేమున్నూ రాజగోపాలాచారిని మెచ్చుకుంటున్నాము.

## ఈ పాటికి శకం మారాలి

కాంగ్రెస్సు వర్కింగు కమిటీ సభ్యులలో పన్నెండుగురు రాజీనామా లిచ్చారు.

బోసుగారి ఆరోపణలకు కినిసి వారా పని చేశారు.

మరి తాము చేసిన ప్రతికూలప్రచారం మాట ?

వర్కింగు కమిటీ సభ్యతను పురస్కరించుకునే బోసుగారిని నిరసించడం శాస్త్రీయ మేనా ?

దానికి శిక్ష లేదా ?

నెహ్రూగారు కూడా అలాంటి వర్కింగు కమిటీలో వుండడం అసాధ్యం అన్నారే ?

ఇదిన్నీ ఆరోపణ కాదా ? దీనికి నెహ్రూగారిమీద కినియరేం ? వారికి జవాబయినా చెప్పరేం ?

బోసుగారి ఆరోపణల కంటే యిది తక్కువది కాదే ?

సత్యాహింసలతో పాటు మైత్రీ మొగమోటమూ కూడా గాంధిగారి యీ అనుచరులకు మూలసూత్రాలా ?

ఇది యిలా వుండగా—

నెహ్రూగారి ధోరణి యేమిటి ?

తమ ఆరోపణలను బోసుగారుపసంహరించుకోవాలా ?

వర్కింగుకమిటీ విశ్వసించతగ్గది కాదా ?

ఈమాటలకు సమన్వయం యేదీ ?

బోసుగారిని ఉపసంహరించుకోమన్నట్టే వర్కింగుకమిటీ సభ్యులను పశ్చాత్తాపపడమని ఆదేశించరేం ?

పరిస్థితులన్నీ సమన్వయించి చూస్తే కాంగ్రెస్సు నియంతలలో సామరస్యం వున్నట్టు తోచదు.

కలతలు బహిరంగంగానే విజృంభించడానికి వ్యవధి కూడా అట్టే కావలసినట్టున్నూ తోచదు.

కాంగ్రెస్సు చరిత్రలో, దాన్ని దేశీయులు గమనించింది మొదలు నాయకత్వానికి సంబంధించిన కలతలు బహువచనం మీదే వున్నాయి.

కాంగ్రెస్సు నాయకత్వం మారవలసిన సమయం ఆసన్నమే అయింది.

## "సందో రాజా భవిష్యతి"

రాజకోట గొడవలో చక్కని అల్లిక కనపడుతున్నది.

ఆ అల్లికలో జటిలతే కాదు, చాతుర్యమూ, లాఘవమూ, కూడా ప్రతిఫలిస్తున్నవి.

౧౯౩౯ లో గాంధిగారి కిది రెండో ప్రతిఘటన!

అమోఘమైన ప్రతిఘటన!!

రాజకోట ప్రభువు ఇందులో నిమిత్తమాత్రులు.

గాంధిగారు, రాజకోట వెళ్లేటప్పుడు చెప్పింది వొకటీ, వెళ్లాక చేసింది వొకటీనీ.

దీనికి తగ్గట్టుగానే, మొదట వొడంబడిక అంగీకరించడానికి వీలు లేదని తిరస్కరించిన రాజాగారు, చివరికి, పూర్తిగా అంగీకరించారు.

ఏమిటి దీని అంతర్యం ?

గాంధిగారికి విజయం ఆరోపించి, ప్రజలు, ధన్యవాదాలు విన్నవించుకుంటున్నారు.

ఇందులో సందర్భశుద్ధి వున్నదా ?

ఇదే నిజమయితే, రాజాగారు అసమర్థులని చెప్పాలి. అనర్హులనీ చెప్పాలి.

కాని చటుక్కున అంతమాట అనెయ్యడం సరసమా ?

రాజాగారు ఏకాకి కారు. నిరంకుశులున్నూ కారు.

ఆత్మీయపరివారం అలా వుండగా, సలహా చెప్పడానికి, వారికి, రెసిడెంటున్నాడు.

వైస్రాయిగారు కూడా యిందులో కలగజేసుకున్నారు.

కాగా, రాజాగారిందులో ప్రజ్ఞ కనపరచాలి; కాని పిరికితనం చూపించకూడదు.

ఈదృష్టితో చూస్తే, యిందులో యెత్తుపైయెత్తే వున్నది; కాని చేతకానితనం లేదు.

పటేలుగారు విధించినట్టు, రిఫారమ్సు కమిటీలో, ప్రజాపరిషత్తువారికే పదింట ఏడు స్థానాలు దఖలుపడుగాక.

వోటింగు హక్కున్నూ వారికే వుండుగాక. అయితే, ఆకమిటీ రిపోర్టు సిఫారసే కాని శాసనం కాదు.

అది యివాళే తయారూ కాదు.

పైగా, పటేలుగారి పక్షానికి కమిటీలో మెజారిటీ వుండడానికే గాని, ఆవొడంబడిక, ఆకమిటీ సిఫారసులను అంగీకరించి తీరాలనీ కాదు.

ఆసిఫారసులు, రాజాగారు, అంగీకరించావచ్చు, తోసివెయ్యావచ్చు. మన్నించావచ్చు, తిరస్కరించావచ్చు. పరిశీలించనూ వచ్చు, బుట్టదాఖలే చేసెయ్యనూ వచ్చు.

ఏమి చేసినా చెయ్యవచ్చు.

ఏది యెలాగయినా యిది యింతలో తేలేది కాదు.

కాని, గాంధిగారు వెంటనే సుష్టుగా భోజనం చేస్తారు.

సంస్థానం విడిచి వెళ్ళిపోతారు.

మళ్లీ సంస్థానంలో ప్రవేశించి అభోజనం కూచోడానికి వారికి అవకాశం దొరకదు.

ఈదోసందులో కాంగ్రెస్సు బండారమున్నూ బయటపడుతుంది.

వింటూ చూస్తూ వుందాం.

## సర్కారు ఉద్యోగాలలో మన వాటా

ఇంజనీరింగు డిపార్టుమెంటులో, ధవళేశ్వరం సర్కిలులో ఎక్జిక్యూటివు ఇంజనీయర్సు పదవులు ఆరున్నాయి. సూపరింటెండింగు ఇంజనీయరు పదవి వొకటున్నది; కాని ఈ యేడు పదవులూ అరవలాక్రమించుకుని వున్నారు.

మరోచోటయినా మన ఆంధ్రుల కిలాంటి భుక్తం కాని, దీనికి తగిన సద్దుబాటు కాని లేదు.

ఇందులోనే కాదు ప్రతీ డిపార్టుమెంటులోనూ—ఇక్కడే కాదు ప్రతీచోటా—ఇంతమాత్రమే కాదు ఇంకా యెంతో యెక్కువగా వ్యత్యాసం కనపడుతూ వుంది.

ఆంధ్రపార్లమెంటువారు ప్రకటించిన—ఈసంచికలోనే మరొక చోట వున్న అంకెలు చూస్తే ఈఅన్యాయం యెంత హద్దుమీరి పోయి వున్నదో బోధపడుతుంది.

"ఇంతా చేసి వుద్యోగాల కోసమా మీ తగువు?" అనే పెద్ద మనుష్యులు లేకపోలేదు.

ఎందుకు కాకూడదూ?

ఉద్యోగా లిమ్మని నిక్కచ్చి చెయ్యడానికి మన ఆంధ్రులకు హక్కున్నది.

మనం ఆగంతుకులం కాము.

మద్రాసు ప్రెసిడెన్సీలో ప్రతిదాన్లోనూ మనకి సగం వాటా వున్నది.

రాజ్యాంగంలో వుద్యోగా లొక పద్దు.

ప్రధాన మైనపద్దు.

ఉద్యోగాలు కోరడం జీతపురాళ్ళకోసమే కాదు, జాతీయ వికాసం కోసం.

ఉద్యోగాలలో ఏజాతికి సరియైన వాటా భుక్తం కాదో, ఆజాతి అవశ్యకాలు గుర్తించబడవు. తీర్చనూబడవు.

ఫలితంగా ఆజాతి బాగుపడదు.

అయితే, మనకీ వుద్యోగదారిద్ర్యం యెందు కేర్పడిందీ?

ఆదిలో, ఇంగ్లీషు ఆఫీసర్లు, తమకి పోగా మిగిలిన వుద్యోగాలు, ఈప్రెసిడెన్సీలో వున్న అయిదారు జాతులవారిలోనూ వొక్కరికే—ఫలానావారికే అని నిర్దేశించ లేదు.

కష్టపడి చదువుకున్న వారికి—చదువుకుని సమర్థత సంపాదించుకున్న వారికి—సమర్థత సంపాదించుకుని కోరినవారికి—కోరి దీక్ష పట్టినవారికి—దీక్షపట్టి గట్టిగా ప్రయత్నించినవారికి—ప్రయత్నించి విడిచిపెట్టనివారికి ఎక్కడా ఎప్పుడూ మంచి అవకాశా లుంటాయి.

ఆ అవకాశాలు వినియోగపరుచుకొన్న వారికి ఉద్యోగాలు దొరుకుతాయి.

నిజం చెప్పవలసివస్తే మనవారిలో యీ లక్షణాలు తక్కువ.

సోమరితనమూ, నిర్లక్ష్యభావమూ, ఇల్లు కదలలేని జబ్బూ మనలో వున్నాయని మనం అంగీకరించక తీరదు.

ఉన్న హక్కు భుక్తపరుచుకోగలిగే ధైర్యసాహసాలు కూడా మనలో తక్కువ అని మనం వొప్పుకోక తీరదు.

జస్టిస్సుపక్షనాయకు లైన మన బ్రాహ్మణేతరాంధ్రప్రముఖులు తమ చేతిలో వుండిన వుద్యోగాలన్నీ బ్రాహ్మణేతర్లకే యిచ్చా రని మనలో గోల హెచ్చుగానే వుంది;

కాని యేదీ?

అరవలను పట్టి చూస్తే మన బ్రాహ్మణేతరుల కయినా తగినన్ని వుద్యోగా లేవీ?

అవకాశా లున్నంతవర కయినా వారు బ్రాహ్మణేతరులను వృద్ధిచేసిన దేదీ?

జస్టిస్సువారికి కూడా ఆంధ్రత్వం జాతీయాభిమానం కలిగించ లేక పోయింది.

ఆవుద్యోగాలు పడసిన బ్రాహ్మణేత ర్లయినా అరవలే అయి పోయారు.

ఉద్యోగా లిచ్చే పబ్లిక్ సర్వీస్ కమిషనులో కూడా ఆదినుంచీ అరవలిద్దరూ ఆంధ్రు డొక్కడూ అయినప్పు డిది మరోలా యెలా జరుగుతుందీ?

ఏతావతా:

మునపటిలాగ యీవిషయం యిప్పుడు వ్యక్తిపరంగా విడిచిపెట్టడానికి వీలులేదు.

జాతిపరంగా మన మీ స్వత్వం సాధించుకోవలసిన సమయం వచ్చింది.

అరవలలో సామాన్యయువకులు కూడా పదవీలాభం పొంది కులాసాగా కాలం గడుపుతూ వుండగా, మన ఆంధ్రయువకులలో అలోకసామాన్యయోగ్యతలు కలవారు కూడా నీడ లేక కుంగిపోతూ వుండడం చూసీమాడనట్టు నిర్లక్ష్యంగా విడిచిపెట్టతగ్గది కాదు.

అన్ని విధాలా తొందర కలిగించగలిగినప్పుడే మన కీవిషయంలో ముక్తి.

మనవాళ్లు లేకపోవడంవల్లనే తెనుగుజిల్లాలలో మైనరు ఇరిగేషను పనులలో కూడా సకాలంలో యేర్పాట్లు జరగకుండా పోతున్నవి.

## ఈమహాభాగ్యాని కేనా యీశ్వరాదేశం?

అభోజనవ్రతం చేసి, చివరికి గాంధిగారు సంపాదించుకున్నది విజయమయినా అపజయ మయినా, వారు రాజకోటరాజాగారి మీద దండెత్తడం మాత్రం చాలా అసందర్భంగా వున్నది.

భరతఖండంలో ఎన్నో వందల స్వదేశసంస్థానా లున్నవి. వాటిలో యీరాజకోట చిన్నది.

చాలా చిన్నది.

దానికి సంబంధించిన ముఖ్యవివరా లిలా వున్నవి.

ప్రభువు పేరు, హిస్ హైనెస్ శ్రీధర్మేంద్రసింహజీ ఠాకూరు సాహేబ్.

జననం, ౧౯౧౦ మార్చి ౮ వ తేదీని. సింహాసనారోహణం ౧౯౩౧ ఏప్రిలు ౨౧ వ తేదీని.

వంశం, జడేజీరాజపుత్రులకు సంబంధించిన విభాజీ శాఖకు చెందినది.

విద్యాభ్యాసం, మొదట, రాజకోటలోనే వున్న రాజకుమార కాలేజీలోనూ, తరవాత, లండన్‌లో హైగేట్ స్కూలులోనున్నూ.

పరిపాలనకు సర్వాధికారాలూ వున్నవి.

సంస్థానం వైశాల్యం ౨౮౩ చదరపుమైళ్లు.

జనసంఖ్య ౭౫,౫౮౦.

సగటు రెవెన్యూ ౧౨,౫౦,౦౦౦.

ఫిరంగుల గౌరవం వంశపరంపరగా ౯.

ప్రజాప్రతినిధిసభ (Peoples Representative Assembly) సాయంతో సెక్రటేరియెట్ పద్ధతి ననుసరించి పరిపాలన జరుగుతున్నది. సార్వజనిక నియోజకత్వం గల లెజిస్లేటివ్ కౌన్సిల్ దానికి మూలంగా వున్నది. ప్రజాసత్తాక మైన మునిసిపాలిటీ వున్నది.

రాజకోట పట్టణం చక్కని వర్తకస్థానం. అక్కడ అనేక పరిశ్రమలు నిర్వహించబడుతున్నవి. రాజకోట పశ్చిమఇండియా స్టేట్సు ఏజెన్సీకి ప్రధానస్థలం. అక్కడ మూడు రెయిల్వే లైనులు కలుస్తున్నవి. విద్యావిషయంలో కూడా కథియవారు కంతా అది కేంద్రం. పట్టణంలో రాజకుమారకాలేజీ వున్నది. ధర్మేంద్రసింహజీ ఆర్ట్సు & సైన్సు కాలేజీ వున్నది. స్త్రీల కొకటీ, పురుషుల కొకటీ ట్రెయినింగు కాలేజీ లున్నవి. బాలికలకు ప్రత్యేకంగా హైస్కూలున్నూ వున్నది.

రాజకోట ఠాకూర్ సాహేబుగారు గాంధిగారికి పూర్తిగా లొంగిపోతారే అనుకుందాం. అయితే, హైదరాబాదు, మైసూరు, బరోడా, గ్వాలియరువంటి పెద్దపెద్ద సంస్థానాలకు అది గుణపాఠం కానేరదు. తరవాతి సంగతి యేమయినా, గాంధిగారికి, ముందు, అక్కడ ఆపెద్దసంస్థానాలలో ప్రవేశమే దొరకదు.

అంధవిశ్వాసం తప్ప గాంధిగారి యీరాజకోటప్రయత్నాలను ప్రశంసించలేదు.

రాజకోట సంస్థానం, గాంధిగారికి జన్మస్థలం కావచ్చు. అయితే, కాంగ్రెస్సు నియంతకు కూడా ప్రాంతీయాభిమాన మేనా?

గాంధిగారిది స్థానబలం మాత్ర మేనా?

పెద్ద సంస్థానాలను దారికి తేగలిగితే చిన్న సంస్థానాల విషయమై ప్రయత్నమే చెయ్యనక్కర్లేదు, తెలుసా?

## ఆంధ్ర పతాక

బెజవాడ ఆంధ్రపార్లమెంటులో ఫిబ్రవరి ౨౬-వ తేదీని ఆంధ్ర పతాకోత్సవం జరిగింది.

ఆంధ్రసామ్రాజ్యం కూలిపోయిన తరవాత యిన్నాళ్ళకి మళ్ళీ ఆంధ్రపతాకం యెగరడానికిదే మొదలు.

పంద్రంగి కేశవరావుపంతులుగారు స్వయంగా పతాకం తయారుచేయించారు.

పతాకలో మధ్యగా స్పష్టంగా కనపడేటట్టు తామరా కున్నది. పైని తామరపువ్వున్నది. దానికి కుడిదిక్కున కలవపువ్వూ, ఎడమదిక్కున గులాబీపువ్వూ వున్నవి. కిందినుంచి పైకి అయినూలగా, తామర, కలువపువ్వులకు నడుమగా ఖడ్గమూ, తామర, గులాబీ పువ్వులకు నడుమగా బాణమూ వున్నవి.

పతాక అడుగుభాగం ఎర్రగానూ, పైభాగం అకుపచ్చగానూ వుంది.

ఎరుపు శౌర్యధైర్యాలకూ, అకుపచ్చన శాంతభావానికీ ద్యోతకాలు. మూడు పువ్వులూ రాయలసీమా, చాళుక్యసీమా (సర్కారు), కాకతీయసీమా (నిజామాంధ్రదేశం) — ఈ మూడింటికీ చిహ్నాలు.

ఆంధ్రపతాకను గురించి యిప్పటి దాకా యెవరూ శ్రద్ధపట్టలేదు.

ఈవిషయంలో పనిచెయ్యడానికి ప్రథములు కేశవరావుపంతులుగారే.

వారి సమయస్ఫూర్తి ప్రశంసాపాత్రంగా వుంది.

సభలో, కొన్ని మార్పులు చెయ్యాలి అని సూచనలు వచ్చాయి.

రాటపుజెండా లాగ వొక పక్షంవారికే కాక, ఆంధ్రులకందరికీ సమ్మత మయేటట్టు అవసర మయితే మార్పులు చేసి యీపతాకను గౌరవించాలని నిర్ధారణ జరిగింది.

కేశవరావుగారు సమ్మతించారు.

ఈపతాక ఆంధ్రోద్యమం మళ్ళీ విజృంభిస్తున్న దనడానికి చిహ్నంగా వున్నది.

## తేలింది యిదన్న మాట

త్రిపురీ కాంగ్రెస్సుకి గాంధిగారు వెళ్లేటట్టు లేదు.

వెళ్లినవారంతా మొగమొగాలు చూసుకుంటున్నారు.

కాళ్లూచేతులూ ఆడక తెల్లపోతున్నారు.

చాలా వింతగా వున్నది.

కాని యిందులో వున్న రహస్యం యేమిటీ?

కాంగ్రెసు పత్రికలు, "ఇదంతా గాంధిగారి మహిమ" అంటున్నవి.

"ఆయన మహాతపస్వి" అంటున్నవి.

"ఏకైక నాయకులు" అంటున్నవి.

"ఆయనను కాదని తిరస్కరించి, వూపిరి పీల్చగలవాడు కాంగ్రెస్సువలయంలో మరి లే" డంటున్నవి.

నిజమే.

ఒప్పుకుంటున్నాం.

ఇదంతా గాంధిగారికి ఘనతే.

ఇదంతా గాంధిగారికి ప్రశంసే.

అయితే, మరి కాంగ్రెస్సు మాటా?

భరతఖండంలో కల్లా పెద్ద రాజకీయపక్షం అనిపించుకుంటున్నది—ఏకైకసంస్థ అని పొగడించుకుంటున్నది—పూర్తిగా యాభై సంవత్సరాలు గడిపినది—గొడ్డుపోయిం దన్న మాటేనా?

కాంగ్రెస్సు సంఘాలు వొక్కొక్క పెద్దమనిషి పేరు చెప్పి జయజయధ్వానాలు చేసేస్తాయే? సమ్మానాల మీద సమ్మానాలు జరిపేస్తాయే? రెక్కలు ముక్కలు చేసుకునీ, దుంపలు దంపలు చేసుకునీ వుక్కిరిబిక్కిరి అయిపోతాయే!

వారివల్ల యేమీ కాదూ?

వారిలో వొక్కరయినా కథ నడపలేరూ ?

గాంధిగారు కాంగ్రెస్సు సభ్యులే కారు. అయినా వారు వెళ్లక పోతే కాంగ్రెస్సు లేదూ ?

నేటికి లెక్కతేలిన కాంగ్రెస్సు సభ్యుల నికరం సంఖ్య, అక్షరాలా, నలభై నాలుగు లక్షల, డబ్భయ్యొనిమిది వేల, యేడువందల యిరవై.

వీరంతా వెళ్ళినా కాంగ్రెస్సు లేదూ ?

సెబాస్ !

గాంధిగారి నాయకత్వానికి పర్యవసానం యిదా ?

వారు యిరవై సంవత్సరాలు చేసిన గాఢతపస్సుకి ఫలితం యిదా ?

---

# హిందీ ముప్పు తెచ్చి పెడుతుంది

వెనక—అంటే ౧౯౧౬ ఆ ప్రాంతంలో, సామాన్యభాషను గురించి ఆంధ్రపత్రికకూ కృష్ణాపత్రికకూ తీవ్రమైన వాదం జరిగింది.

అప్పట్లో ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీహరిసర్వోత్తమరావు పంతులుగారు.

కృష్ణాపత్రిక హిందీ కావాలనీ, ఆంధ్రపత్రిక ఇంగ్లీషు కావాలనీ దీకొన్నవి.

ఆరెండూ పనికి రావని నావాదం.

అప్పుడు, నాలేఖలు, ఆంధ్రపత్రికలోనూ కృష్ణాపత్రికలోనూ కూడా ప్రకటించబడ్డవి.

౧౯౧౯ లో, మద్రాసులో జరిగిన ఆంధ్రసారస్వతపరిషత్సమావేశానికి అధ్యక్షత వహించిన కొమర్రాజు లక్ష్మణరావుపంతులు గారు హిందీని నిరసిస్తూ మాట్లాడారు. ౧౯౨౨ సంవత్సరం మెయి నెలలో, విద్యాశేఖర. అక్కిరాజు ఉమాకాంతం పంతులుగారు, తమ తెనుగుదేశవాఙ్మయపత్రికలో, అతివివరంగా ౧౧ పేజీల తీవ్ర చర్చ చేసి హిందీని స్వీకరించడం బుద్ధితక్కువ పని అని స్పష్టపరిచారు.

తరవాత దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు కూడా సహజావేశంతో హిందీని ప్రతిఘటించి వుండినారు.

౧౯౨౮—౨౯ లలో ప్రబుద్ధాంధ్రలో నేను హిందీని నిరసించాను.

౧౯౩౮ జూలై మొదలు ఇప్పటికీ ప్రబుద్ధాంధ్ర ప్రకటించిన ప్రతీ నెలలోనూ నేనీ ప్రతిఘటన చూపిస్తూనే వున్నాను.

౧౯౩౮ అగస్టులో భారతి నావాదం సమర్థిస్తూ హిందీని ఎదిరించింది.

ఆవ్యాసం అనువదించుకుని, ఆసంవత్సరం అక్టోబరులో ప్రకటించుకోవడమే కాకుండా, కర్ణాటకసాహిత్యపరిషత్పత్రిక, యీచిచ్చు కన్నడదేశంలో కూడా లేపింది. దానిమీద కన్నడు లనేకులు దాన్ని పురస్కరించుకుని హిందీని ప్రతిఘటించారు. వారి విరోధం సహించలేక కలేల్కరుగారు వొకమాటు చాలా తబ్బిబ్బు లయిపోయిన్నీ వుండినారు.

తరవాత ప్రజామిత్ర, మొదలైన ఆంధ్రపత్రికలు పూర్తిగా నావాదం అంగీకరించి హిందీని నిరసించాయి. ఆంధ్రపత్రిక కూడా నావాదం అంగీకరించిన సందర్భాలు లేకపోలేదు.

సరే, యిప్పుడీవిషయమై జనవాణి చూపిస్తూ వున్న ధైర్యసాహసాలూ, శ్రద్ధాసక్తులూ జగద్విదితాలే. బాధ్యత యెరిగిన సర్. రడ్డి నాయడుగారివంటి ఆంధ్రనాయకులు కూడా హిందీకి ప్రాతికూల్యమే చూపిస్తున్నారు.

ఇలాగ ఆదినుంచీ ఆంధ్రపండితులూ, ఆంధ్రప్రముఖులూ, ఆంధ్రపత్రికలూ, బాధ్యత గల ఆంధ్రపౌరులూ హిందీప్రాతికూల్యం కనపరుస్తూ వుండగా—గాంధిగారి హిందీప్రచారం నిరశిస్తూ వుండగా మన తెనుగుపార్లమెంటరీ శక్రటరీలు కొందరూ, తెనుగుమంత్రులు కొందరూ, తెనుగుదేశంలో హిందీకి ప్రతిఘటన లేదని అరవదేశం మారుమూలల్లో విన్నవించుకుంటున్నారు.

ఏమిటి దీనివల్ల ప్రయోజనం ? ఇది ఆత్మద్రోహం చేసుకోడం అనాలా, కళ్లూ చెవులూ పనిచెయ్యకపోవడం, అనాలా ?

జాగ్రత్త.

హిందీ, మనుష్యులను కూడా తప్పుదారిలో పెడుతుంది.

---

# సరస్వతీ గ్రంథమండలి

కంభంవారి సత్రమ్ము వీధి ** రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటయైనార్చు అచ్చుతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆపుస్తకములు అన్ రిజిస్టర్డు పార్సిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | |
|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 |
| 15 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 |
| 22 మొంగలాయీదర్బారు 1 వ భా॥ | 1 8 0 |
| 23 ఘటనాచక్రము | 1 8 0 |
| 24 రాజసుందరి | 1 8 0 |
| 25 కుంకుమభరణి | 1 8 0 |
| 26 జాగిలము | 1 8 0 |
| 27 మొంగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 |
| 28 సరస్వతి | 1 8 0 |
| 29 ఆనందాభాయి | 1 8 0 |
| 30 హత్యాన్వేషణము | 1 8 0 |
| 31 మొంగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 |
| 32 గంగ | 1 8 0 |
| 33 మొంగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 |
| 34 కోహినూరు | 1 8 0 |
| 35 ఆటిన్ మణేలా | 1 8 0 |
| 36 అపరిచిత | 1 8 0 |
| 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 |
| 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 |
| 39 అగ్రహారము | 1 8 0 |
| 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 |
| 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 42 కంకణరహస్యము | 1 8 0 |
| 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 44 సంజీవి (2 వ భాగము) | 1 8 0 |
| 45 వ్రజరాణి | 1 8 0 |
| 46 హత్యాభ్రమ | 1 8 0 |
| 47 కాశీఖండము | 1 8 0 |
| 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 |
| 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 |
| 50 దానీకన్య | 1 8 0 |
| 51 స్త్రీసాహసము ప్రథమభాగము | 1 8 0 |
| 52 స్త్రీసాహసము 2 వ భాగము | 1 8 0 |
| 53 మేరీరాణి | 1 8 0 |
| 54 రాజ్యలక్ష్మి | 1 8 0 |
| 55 లీల | 1 8 0 |

## అనుబంధములు

| | |
|---|---|
| 1 మృత్యుతరంగిణి | 0 12 0 |
| 2 అభాగిని | 0 12 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 |
| 5 కాంచనమాల | 1 0 0 |
| 6 సీమంతిని | 1 0 0 |
| 7 సుశీల | 1 0 0 |
| 8 శశిరేఖ | 1 0 0 |
| 9 యమునాబాయి | 1 0 0 |
| 10 శ్యామల | 1 0 0 |
| 11 కాంతం కథలు (చిన్నకథలు) | 1 0 0 |
| 12 కాలసర్పి | 1 0 0 |
| 13 భారతకథాసారం | 1 0 0 |
| 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 |
| 15 అరణ్యణీయ | 1 0 0 |
| 16 మాధవి | 1 0 0 |
| 17 లలిత | 1 0 0 |
| 18 పెండ్లిదండ | 1 0 0 |
| 19 కథావళి | 1 0 0 |
| 20 నాలుగుకథలు | 1 0 0 |
| 21 నీతిప్రబోధిక | 1 0 0 |
| 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 23 ఉదంకుడు | 0 12 0 |
| 24 భేతాళకథలు | 0 12 0 |
| 25 దయ్యాలు | 0 12 0 |

## నాటకములు

| | |
|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 |
| 3 మిావారుపతనము | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 |
| 5 రాజహంస | 1 0 0 |
| 6 సూర్జహాను | 1 0 0 |
| 7 దుర్గాదాసు | 1 0 0 |
| 8 చంద్రగుప్త | 1 0 0 |
| 9 దంపతులు | 1 0 0 |
| 10 విజయవిజయం | 1 0 0 |
| 11 భక్తకుచేల | 1 0 0 |

ఈ పుస్తకాలు రాజమండ్రీ కలాభివర్ధనీ పరిషత్తులోకూడా దొరుకును

# వస్తుగుణప్రకాశిక

## గిల్టు కాలికో బైండులో,
## అనుబంధములతో
## 1150 పేజీల గ్రంథము

ఇది సమస్త వస్తువులయొక్క గుణములను సంపూర్ణముగ తెలియజేయు నూతనగ్రంథము. ఆంధ్రవైద్య లోకమునకు, స్త్రీ పురుషులకు మిక్కిలి యుపయోగకరమగునటుల సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యశిఖామణులు ఆయుర్వేదభూషణ, భిషగ్వర, పండిత బ్రహ్మశ్రీ వీటూరి వాసుదేవశాస్త్రి ఏ. ఎమ్. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఈగ్రంథమునందు ఉపయోగకరమగు పెక్కు వస్తుగుణములే 1104 పేజీలు గలవు. ఇవిగాక వివిధరోగములయొక్క ఉత్పత్తి, వాటి చికిత్సలు 50 పేజీలవరకు అనుబంధములుగా చేర్చబడి, మొత్తము గ్రంథము 1150 పేజీలను కలిగి యున్నది. వస్తువులయందలి రస, వీర్య, విపాకప్రభావములును, వాటిస్వరూపములును, గుణములును ప్రయోగములును ఈగ్రంథమునందు చక్కగ నిరూపింపబడినవి. వస్తుప్రయోగములు వంగసేన, వాగ్భటము, చరకము, సటకర్ణి, సుశ్రుతము, భావప్రకాశిక, భైషజ్యరత్నావళి, చక్రదత్త, హారీతసంహిత, ఆర్. ఎల్. ఖోరీ మొదలైన వివిధవైద్య గ్రంథరాజములనుండి సేకరింపబడి తద్గ్రంథముల పేళ్లతో నిందు పొందుపరుపబడినవి.

వైద్య సాహాయ్యమవసరములేకయే యీగ్రంథముండిన సామాన్య రోగములన్నిటికి బజారులలో దొరుకు సాధారణ వస్తువులతో చికిత్సలు జరుపుకొనవచ్చును. ఇది ప్రతియింట నుండదగిన అమూల్య గ్రంథము.

వెల రు. **5-0-0** (పోస్టుఖర్చులు ప్రత్యేకము)

వలయువారు :—

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

అని వ్రాయవలెను

<u>వస్తుగుణప్రకాశిక మాదిరి పేజీ</u>

చందనం :—శ్రీఖండ - మలయజ - చందన — Sandal wood - ఎరుపు, తెలుపు, పసుపు రంగులతో నిది మూడువిధములు. శ్వేతచందనమున - Santalum Album రక్తచందనము - Pterocarpus Santalinus కుచందనం - Adenanthera Pavonina

స్వరూపము — చందన మొక పెద్దవృక్షము. మలయ పర్వతములయందు విస్తారముగా పెరుగును. ఇప్పు డాంధ్రదేశములో కూడా యుద్యానవనములలో నచ్చటచ్చట వేయుచున్నారు. ఆకులు కొంచెము పొడవు గలిగి చిన్నవిగా నుండును. తెల్లని పూవులు గుత్తులుగుత్తులుగా పూయును. దీనికి సంపెంగ కాయలవంటి కాయలు కూడ ఉండును. మ్రాను తెల్లగా నుండును. బాగుగా ముదిరినగాని చెట్టుకు సువాసన రాదు. ముదిరిన మంచి చెట్లకు తొఱ్ఱలుండును రక్తచందనముయొక్క ఆకులు నువ్వుఆకులవలె నుండును. కాయలు పగడకాయలవలె నుండును. చాల యెఱ్ఱగా నుండును. కుచందనము మిక్కిలి యెఱ్ఱగా నుండును. బట్టలకు రంగు వేయుదురు.

గుణములు — తెల్లచందనము : ఇది చేదును తీపియును గల రుచి గలిగి యుండును. మిక్కిలి చలువచేయును. ప్రియమైన సువాసన. పైత్యమును శమింపజేయును. రక్తదోషములను హరించును. వీర్యవృద్ధిని గలిగించును. అంతస్తాపమును హరించును. విషహరము. క్రిమిహరము. దప్పిని కొట్టును. మధురవిపాకము గలది. రూక్షగుణము. మిక్కిలి చల్లగా నుండును.

## వస్తుగుణప్రకాశిక మాదిరిపేజీ తరవాయి

ఎఱ్ఱచందనము : చేదురుచి. శీతవీర్యము. రక్తపుపోటును తగ్గించును. దారుణపైత్యప్రకోపమును శమింపజేయును. నేత్రములకు హితకరమైనది. శరీరమునకు కాంతినిచ్చును.

కుచందనము : చేదురుచి. మిక్కిలి సువాసనగలది. వ్రణములను మాన్పును. ముఖరోగములకు హితకరమైనది. శీతవీర్యము మధుర విపాకము గలది.

ప్రయోగములు

పిల్లల నాభిపాకమునకు :—మంచి గంధపు చూర్ణము నాభికద్దిన మానును. మరియు పాలుగల చెట్ల పట్టచూర్ణము రుద్దినను మానును. (వంగసేన, బాలరోగాధికారము)

మశూచకమునకు :—చందనము ముద్దగా నూరి చిలుకకూర రసముతో నిచ్చిన (మశూచకము ప్రవేశించిన వెంటనే) మశూచికము ప్రమాదించకుండ విరమించును.

మూత్రాఘాతమునకు :—తెల్లచందనము మెత్తగానూరి బియ్యపు కడుగుతో కలిపి త్రాగి, కాచి చల్లారిన పాలతో అన్నమును తినిన మూత్రాఘాతము కట్టును. మరియు రక్తముతో కూడిన యుష్ణ వాతమును గూడా కట్టును. (భావప్రకాశిక)

శుక్లనష్టమునకు :— చందనచూర్ణమును కడిమిచూర్ణమును కలిపి పాలతో ద్రావిన శుక్లనష్టము కట్టును.

ప్రదరమునకు :—చందనము వేపచెక్క కషాయము పెట్టి త్రాగిన దుర్గంధముతో గూడిన ప్రదరముకూడ కట్టును. (సుశ్రుత)

రక్తవిరేచనములకు :—మంచిగంధపుముద్ద బియ్యపుకడుగులో కలిపి అందు తేనె పంచదారయును జేర్చి త్రాగిన రక్తాతిసారము, ప్రమేహము, దప్పి, తాపము తగ్గును.

వాంతికి :—చందనచూర్ణమును ఉసిరికరసముతో నిచ్చిన వాంతులు కట్టును.

ఎక్కిళ్లకు :—చందనపుముద్ద చనుబాలలో కలిపి నస్యము చేయించిన ఎక్కిళ్లు (హిక్కా) కట్టును. (చరకము)

రక్తపిత్తమునకు :—చందనము, వట్టివేరు, మ్రానిపసుపు సమభాగములుగా గ్రహించి బియ్యపుకడుగులో కలిపి త్రాగిన రక్తపిత్తము తత్క్షణమే తగ్గును.

తెల్లకుసుమలకు, సెగలకు :—చందనచూర్ణము ½ తులం, మఱ్ఱిపాలు [1] తులం, పంచదార ½ తులం, యివన్నియును జేర్చి ప్రతిప్రాతః కాలమందును యేడు దినములు సేవించిన తెల్లకుసుమలు సెగలు కట్టును. వీర్యవృద్ధికరము.

చందనముతో పలురకముల యోగములు కలవు. చందనాది చూర్ణము, చందనాసవము, చందనాదివటి మొదలగునవి. ఇవి బజారు వైద్యషాపులలో దొరుకును. గ్రంథవిస్తరభీతిచే యోగములు వ్రాయలేదు. మరియు చందనమునుండి తీసిన తైలము మిక్కిలి పరిమళముగా నుండును. దీనివలన శగరోగములు, చెవిపోట్లు, చిడుము మొదలగు చర్మవ్యాధులును కట్టును.

# పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే
## తయారుచేయబడిన దివ్యౌషధములు

| | | | |
|---|---|---|---|
| మకరధ్వజం. మూడువంటలు చేసినది. తులం | 12 | 0 | 0 |
| వసంతకుసుమాకరం. ప్రమేహములకు | 20 | 0 | 0 |
| మహాలక్ష్మీవిలాసరసం. క్షయలకు | 12 | 0 | 0 |
| పూర్ణచంద్రోదయం. క్షయలకు | 12 | 0 | 0 |
| భాగవృద్ధిమహాలక్ష్మీవిలాసరసం. | 8 | 0 | 0 |
| సువర్ణసూర్యావర్తి. పైత్యశాంతికి | 8 | 0 | 0 |
| కనకశాలసూర్యోదయం. జీర్ణజ్వరాలకు | 8 | 0 | 0 |
| మహాసింహాగభూషణం. గర్భిణులకు | 8 | 0 | 0 |
| మహావాతరాక్షసం. సర్వవాతాలకు | 8 | 0 | 0 |
| పుటపక్వవిషమజ్వరాంతకలోహం. | 6 | 0 | 0 |
| సువర్ణకాంతవల్లభరసం. | 5 | 0 | 0 |
| కాంతవల్లభరసం. శోథలకు | 3 | 0 | 0 |
| సువర్ణక్రవ్యాధి. అజీర్ణాలకు | 4 | 0 | 0 |
| [illegible]తచంద్రోదయం. శుక్లనష్టానికి | 3 | 0 | 0 |
| [illegible]క్రాంతచంద్రోదయం. శ్వాసకాసలకు | 3 | 0 | 0 |
| బాలసూర్యోదయం. జీర్ణజ్వరాలకు | 3 | 0 | 0 |
| అభ్రకపంచామృతరసం. నిశ్శక్తులకు | 3 | 0 | 0 |
| వ్యాధిహరణరసం. రక్తశుద్ధికి | 3 | 0 | 0 |
| రజతలోహరసాయనం. | 3 | 0 | 0 |
| మహాయోగరాజగుగ్గులు. కీళ్లనొప్పులకు | 2 | 0 | 0 |
| బుతుశోధక. రుతుశూలలకు | 2 | 4 | 0 |
| షడ్గుణసిందూరం. నిశ్శక్తులకు | 2 | 0 | 0 |
| [illegible]రాట్టు. కఫవ్యాధులకు | 2 | 0 | 0 |
| [illegible]ర్ణవంగము. ప్రమేహాలకు | 2 | 0 | 0 |
| [illegible]తవిధ్వంసి. సూతికావాతాలకు | 2 | 0 | 0 |
| సిందూరభూషణం. గర్భవతులకు | 2 | 0 | 0 |
| సూర్యావర్తి. ఛర్దులకు | 2 | 0 | 0 |
| చంద్రప్రభావటి. మూత్రకోశవ్యాధులకు | 2 | 0 | 0 |
| బృహచ్చంద్రప్రభాగుటిక. మూలశంకలకు | 2 | 0 | 0 |
| నిత్యానందరసం. బోదకాళ్లకు | 2 | 0 | 0 |
| క్రవ్యాదరసం. అజీర్తికి | 1 | 8 | 0 |
| సన్నిపాతభైరవి. సన్నిపాతాలకు | 1 | 8 | 0 |
| లక్ష్మీవిలాసం. శ్లేష్మరోగములకు | 1 | 8 | 0 |
| మహాశంఖవటి. శూలలకు | 1 | 0 | 0 |
| రజఃప్రవర్తినీవటి. కష్టార్తవానికి | 2 | 0 | 0 |
| వాతగజాంకుశం. 80 వాతాలకు | 0 | 12 | 0 |
| యోగినీరసం. ఆమజ్వరాలకు | 0 | 12 | 0 |
| విరేచనవటి. సుఖవిరేచనాలకు | 1 | 0 | 0 |
| 39. కర్పూరరసం. అతిసారాలకు | 1 | 0 | 0 |
| 40. స్వచ్ఛన్నం. చంటిపిల్లలకు | 1 | 0 | 0 |
| 41. అగ్నికుమారరసం. అజీర్తికి | 0 | 12 | 0 |
| 42. శీతాంశురసం. శీతజ్వరాలకు | 0 | 8 | 0 |
| 43. ఆనందభైరవి. జ్వరాతిసారాలకు | 0 | 8 | 0 |
| 44. కస్తూరిమాత్రలు. పిల్లలకు | 0 | 8 | 0 |
| 45. పైత్యాంతకరసం. పైత్యాలకు | 0 | 8 | 0 |
| 46. అగ్నితుండి. అజీర్తికి. అగ్నిమాంద్యానికి | 0 | 8 | 0 |
| 47. గంధర్వకళ. బలానికిలేహ్యం | సీ 3 | 0 | 0 |
| 48. నాగరఖండం. అజీర్తికిలేహ్యం | 3 | 0 | 0 |
| 49. చ్యవనప్రాశం. క్షయలకు | 2 | 8 | 0 |
| 50. మహాసుగంధ్యాదిలేహ్యము | 2 | 8 | 0 |
| 51. అశ్వగంధాదిలేహ్యము | 2 | 8 | 0 |
| 52. రత్నపురుషలేహ్యము. శుక్లనష్టానికి | 2 | 8 | 0 |
| 53. మహాఖండార్ద్రకలేహ్యము. ఆమ్లపైత్యాలకు | 2 | 8 | 0 |
| 54. కూష్మాండలేహ్యం. రక్తపిత్తాలకు | 2 | 8 | 0 |
| 55. మేథీమోదకము. దేహపుష్టికి | 2 | 8 | 0 |
| 56. బృహత్ హరిద్రాఖండం. రక్తశుద్ధికి | 4 | 0 | 0 |
| 57. భాస్కరలవణం. అజీర్తికి | 0 | 10 | 0 |
| 58. తాళీసాదిచూర్ణము | 0 | 10 | 0 |
| 59. శిలోపలాదిచూర్ణము | 0 | 15 | 0 |
| 60. హింగ్వష్టకచూర్ణము | 0 | 10 | 0 |
| 61. పుష్యానుగచూర్ణము | 0 | 10 | 0 |
| 62. అవిపత్తికరచూర్ణము | 0 | 10 | 0 |
| 63. వృద్ధగంగాధరచూర్ణము | 0 | 10 | 0 |
| 64. సుదర్శనచూర్ణము | 0 | 10 | 0 |
| 65. మహాద్రాక్షాదిచూర్ణము | 1 | 4 | 0 |
| 66. మాదీఫలరసాయనం | 0 | 10 | 0 |
| 67. జంబీరరసాయనం | 0 | 8 | 0 |
| 68. ధాతురంజని. వీర్యస్తంభనకు | 1 | 0 | 0 |
| 69. గంధర్వదంతచూర్ణము | 0 | 4 | 0 |
| 70. చాతుర్జాతకచూర్ణము | 0 | 10 | 0 |
| 71. వాసారుద్రతైలము (రక్తశుద్ధికి) | 1 | 8 | 0 |
| 72. పిండతైలము (పగుళ్లకు) | 1 | 0 | 0 |
| 73. భృంగామలకతైలము | 0 | 10 | 0 |
| 74. నారాయణతైలము (వాతాలకు) | 1 | 0 | 0 |
| 75. చందనాదితైలము | 1 | 0 | 0 |
| 76. శ్వాసకుఠారం (దగ్గులకు) | 0 | 12 | 0 |

# సరస్వతీ పవర్ ప్రెస్ గ్రంథాలయము

## రాజమహేంద్రవరము

---

ఈముద్రాయంత్రము భాషాగ్రంథములు తెలుగు—సంస్కృతము—అరవము—ఇంగ్లీషు భాషలలో ముద్రింపఁ దలఁచువారికి మిక్కిలి యనువుగ నుండును. ఇందుపుస్తకములు చక్కఁగ [illegible] రించుపండితులు గలరు. మిక్కిలి చక్కఁగా ముద్రింపఁ [illegible] వారందఱు నీముద్రాయంత్రమునఁ దమ గ్రంథములు ముద్రించుట [illegible]పంచిది. మఱియు నితరము లగునచ్చుపను లన్నియు నిందు మిక్కిలి బాగుగఁ జేయఁబడును. అన్నిరకముల అచ్చుపనులు, ఎంగ్రేవింగు పనులు, బైండింగు పనులు మిక్కిలి సుందరముగాఁ జేయఁబడును.

విశేషాంశములు తెలిసి కొనఁగోరువారు:—

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు,

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.

అని వ్రాయనగును.

రాజమహేంద్రవరము: శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్సందు ముద్రితము.
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. [illegible]